# జానకీపరిణయము.

కృతికర్త


సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,

**Proficient in Oriental Learning.**


1937

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

ఉ. శ్రీలలితాంగి వక్షమునఁ జెన్నలరారఁగ, నాల్గుసేతులన్
గ్రాలఁగ శంఖచక్రములు ఖడ్గగదల్, గళభాగమందుఁ దో
మాలెలు వ్రేలఁగా, భువనమండలమేలు దయాపయోధి యె
క్కాలము వేంకటేశ్వరుఁడుగాచుత శంకరరెడ్డి ధీనిధిన్॥ 1

మ॥ తలఁబ్రాలందగఁబోయఁగా జవనికాంతర్వర్తి సీతాశిరః
స్థలిపైఁ, దానును దూరి తజ్జవనికాంతర్భాగ, మచ్చోట నే
రలుఁ దమ్ముంగనకుంటఁ దద్యువతి వక్త్రంబట్టె ముద్దాడిన
వ్వులతో వచ్చెడు రాముఁడేలుత సతంబున్ శంకరక్ష్మాధవున్॥ 2

మ। శివముల్ చిల్కుకటాక్షముల్ నెఱపుచున్ శ్రీశంకరక్షోణి భృ
ద్భవనంబందున నిల్చి, వల్లకిపయిన్ దత్పుణ్యచారిత్ర కీ
ర్తివిశేషంబుల గానముంజలుపుచున్, దీర్ఘాయురారోగ్య వై
భవముల్ కల్గఁగ సంతతంబునతనిన్ వాగ్దేవి దీవించుతన్॥ 3

మ॥ శ్రుతులంబేర్కొనఁబడ్డ వేల్పులగు నాసూర్యాగ్నులున్ శ
క్రుఁడున్
మతిమత్త్వంబును బూతభావమును శ్రీమత్త్వంబుసంధించి వి
శ్రుతతజ్జన్మము సార్థకంపఱుచుచున్ శోభిల్లఁగాఁజేయుచున్
సతమున్ శంకరరెడ్డి ధీవరుని రక్షాబద్ధు నింజేయుతన్॥ 4

శా॥ ఫాలంబందున నగ్ని, యౌదలజటాభారంబు, గాత్రంబునన్
వ్యాళంబుల్, గజచర్మవస్త్రమెనరయ్యా? నీవు దేవాజ్ఞ నే
కేలా? యంతిపురానికేఁగెదని పోనీకుండ దౌవారికుల్
శూలిన్ నిల్పఁగఁజూచినవ్వు శివప్రోచ్చున్ శంకరస్వామ్మనర్షన్॥ 5

సీ॥ శతవధాన విధాన చాతుర్య ధుర్యుండు
సద్యశోధవళితాశాగణుండు
షడ్దర్శనీమహాసాగరాగస్త్యుండు
సంగీతవిద్యావిశారదుండు
కంకపీంద్రాబ్ధిసంఘృష్టిమంథనగంబు
దివ్యమంగళలసద్విగ్రహుండు
ఆంగ్లాంధ్రవిబుధభాషాంగనాశ్లిష్టుండు
కల్పశాఖాయిత కరయుగుండు

గీ॥ ప్రకట వేలూరి వంశార్ణవ ప్రభూత
సోముఁడైనట్టి శ్రీశివరామశాస్త్రి
మద్గురూత్తముఁడామహామహునకే నొ
నర్తు సాష్టాంగదండ ప్రణామశతము॥ 6

శా. శ్రీమంతంబగు భారతాహ్వాయ మహాక్షీరప్రవాహానికిం
దూముల్ పెట్టియు నాంధ్రభూమికినిఁ దద్దుగ్ధంబుఁ బాఱించి బ్ర
హ్మామోదంబుగఁ దృప్తిదీఱునటులీ యాంధ్రాళిఁ ద్రాగించి రా
ధీమన్నన్నయ తిక్కనెఱ్ఱనలఁ బ్రార్థింతున్ వచశ్శుద్ధికిన్॥ 7

గీ॥ తానొకండె భాషాలతో ద్యానమందుఁ
దోఁటమాలిగ భావించు దోహదముల
నూతనములైన ఫలపుష్ప జాతిగణము
పెద్ద సృజియింతునని విఱ్ఱవీఁగుఁగుకవి॥ 8

## కృతిపతి వంశవర్ణనము.

కవులై గ్రంథములన్ రచించిరి, మహాక్ష్మామండలంబేలి, రా
హవపాండిత్యబలంబుఁగన్పఱచి, రాయాయగ్రహారంబు లి
చ్చి వదాన్యత్వముఁజూపి, రెవ్వరిల నాశ్రీపాకనాఁడన్వయా
ర్ణవ శుభ్రాంశువులైన రెడ్డివిభుబృందంబుంబ్రశంసించెదన్॥ 9

కం॥ ఆరెడ్డివంశమునఁ జె
న్నారఁగఁగర్నూలు మండలాంతరమున ధ
ర్మారంభులైన ఒత్తుల
వారలుమహాద్గల్య గోత్రభవు లొప్పిరిమున్॥ 10

ఒత్తులవారికెల్ల సిగఃబంతి; సముజ్జ్వల కీర్తి తేజముల్
గుత్తకుఁ గొన్నపెద్ద; బుధకోటికిఁ గొంగుఁబసిండి; శౌర్యసం
పత్తికిఁగాణయాచి, నిజభవ్య చరిత్రల లోకమెల్ల స్వా
యత్తముగాఁగఁజేసె మహితాత్ముఁడు వేంకట రాయఁడా
ఢ్యుఁడై" 11

కం॥ తనవిక్రమంబె కవచము,
తన హస్తద్వయమె దివ్య తరఖడ్గములై,
తనబుద్ధియె సచివుండయి
మన వేంకటరాయపతికి మసలు రణములన్॥ 12

మ॥ "అవుజక్" పట్నము రాజధానిగను రాజ్యంబేలుచున్ దన్నిజా
మవనీరాష్ట్రమునందుఁ బెద్ద మొనగాఁడై యుండి, గద్వాల భూ
ధవచంద్రుండగు సోమభూవరునితో ధైర్యోన్నతిన్ బాహుగ
ర్వవిశేషంబునఁబోరి యాఘనుఁడు వీరస్వర్గమొందెందుదిన్॥ 13

కం॥ ఆవిభువరునకుఁదిమ్మ
క్ష్మావరుఁడుదయించె నమృతసాగరమందున్
జైవాతృకుండు వోలెను
శ్రీవిలసత్కీర్తిచాంద్రిఁజేయుచు దిశలన్॥ 14

కం॥ కవిమండలముల ధనమును
యువతులపై మదనశరములు ద్ధతిమెయి శా
త్రవులపయినశనులను ది
మ్మవసుమతీశ్వరుకటాక్షమాలిక గురియున్॥ 15

గీ॥ అట్టి తిమ్మక్షితీశ్వరుండనెడు నరఁటి
చెట్టునకు మూఁడు సిలకలుపుట్టె; దాసి
రెడ్డి రామిరెడ్డియు రంగరెడ్డి నాఁగ
నలరఁజేయుచు నిజకులోద్యానసీమ॥ 16

చ॥ సరసుఁడు దాసిరెడ్డి గుణసాంద్రుఁడు శూరుఁడు శూరతాదు
ద్ధరజనతోపహారములు దద్దయుఁజేకొనుచున్ నిజప్రజం
గరుణ దలిర్పఁబ్రోచుచును గ్రామములిచ్చుచు నాశ్రితాళికిన్
ధరఁదగె దుర్జనాధికుల దండనఁజేయుచుఁ, గాచుచార్తులన్॥ 17

ఉ॥ ధర్మమహింస, యార్జవము, దర్పము, శౌచము, శౌర్యమీమహా
కర్మములందుఁబట్టుదల గాఢముగాఁగలవాఁడు; విద్యలన్

వర్ణములన్ గ్రహించెడు సమర్థుడు; దుర్ధరతీక్ష్ణ శేముషీ
వర్ణముఁదాల్చువాఁడయి ప్రవర్తిలుచుండెను రామ
రెడ్డితాన్॥ 18

గీ॥ విజయలక్ష్మిక్రికి వేణిగావెలయుచున్న
తనకృపాణి రంగారెడ్డి దాల్పఁజేత
వలచియభిముఖియగుచుఁ గౌఁగిలికిఁజేర్చి
సౌఖ్యములఁ దేల్చుచుండె నాశ్చర్యమయితని॥ 19

మ॥ నిలువంగానని రంగభూపతి కృపాణీ మోహినీకాంత దు
ర్బలులై ధైర్యముఁదూలి శత్రునృపతుల్ ప్రాపింతురి స్తం
భంబునుం,
ప్రళయం, బశ్రులు, కంపముం, జెమట, వైవర్ణ్యంబు వైస్వర్యమం
దల రోమాంచము, దుఃఖకాననములన్ సంచారముల్
సల్పుఁబైన్॥ 20

మ॥ ఘనులుద్దండులు రామిరెడ్డియును రంగారెడ్డియున్ ధర్మ ప
ర్తనులై పెండ్లికిఁబోయినట్టులనికిన్ దర్పంబునంబోయి శ
త్రునికాయంబును నుగ్గునూచముగ దంతుర్గానిపై దేవదా
సను దుర్మార్గుడు వీరిఘాటికిని దాఁనాఁగంగలేకత్తరిన్॥ 21

గీ॥ చెలిమికారంబుఁ బ్రకటించి పిలిచి యింటి
కర్థ్మ సత్కారములఁజేసి యర్ధరాత్ర
మందు నిదురించుచుండఁగా నగ్గిపెట్టె
వారు పండిన మిద్దెకు వారు మ్రగ్గ॥ 22

గీ॥ దాసిరెడ్డికిఁగలరు పుత్త్రికులు ముగురు
వరుసఁ బెద్ద రంగారెడ్డి భవ్యమూర్తి
మరియుఁ జిన్న రంగారెడ్డి సరసవరుఁడు
ప్రియగుణుండగు గోవిందరెడ్డి యనఁగ॥ 23

శా॥ ఆగోవిందయరెడ్డిముఖ్యుఁడు వివాహంబాడెఁ బెన్ గూర్మిపెం
నాగశ్వేశ్వరియైన బాగమను నిత్యంబా మహా దేవినిన్
వేగుంబోకలసంస్మరింపఁ దొలఁగున్ నిక్కంబుగాఁ బాపఘోఁ
బ్రోగుల్, కల్గును నెల్లవారలకునుం బుణ్యంబుగణ్యంబుగన్॥ 24

కం॥ గోవిందరెడ్డి బాగమ
దేవివలన లక్ష్మిరెడ్డి ధీవరుని యశ
శ్శ్రీవరుఁ బెద వేంకటధర
ణీవరుఁ జిన వేంకటావనీపతిఁ గాంచెన్॥ 25

శా. ఈఁడెవ్వండిల లక్ష్మిరెడ్డి పతికారే! యాస్మృపాలావళీ
చూడారత్నము సత్యవాగ్రతుఁడు, శ్రేష్ఠుండజేసి పత్నీవ్రత
క్రీడాప్రౌఢిఁ; ద్రికాలవిజ్ఞుఁడు, ప్రజాశ్లేషముంకి రారంభుఁడుఁ
ప్రౌఢం జెప్పనశక్య, మొందెమ్మతిభీష్మండట్లుసంక్రాంతిలోన్॥ 26

చ॥ ప్రతిపురిసంచరించుఁ, బ్రతివారిగృహంబులఁ గ్రుమ్మరుచుం, బ్రతి
క్షితిపతికంఠవక్షములఁ జేరి కడుంగడుఁ దొర్లుచుండు, న
ప్రతిహతశక్తియైనలరురాజ శిఖామణి లక్ష్మిరెడ్డికీ
ర్తితరుణి; కాని నిర్మలచరిత్రి కళంకము లేదొకింతయున్॥ 27

వ॥ ఆతని కర్ధాంగియై నాగమాంబ యొప్పె.

గీ॥ మాటమంచి తనమ్మున, మరియుఁ జుట్ట
పక్కములఁ బెట్టు పోతల, వారలయెడఁ
గలుపుఁ గోలుతనంబునఁగాని మొదటఁ
జెప్పి నాగమాంబను వేఱ చెప్పవలయు॥ 29

కం॥ అల పెద వేంకటరెడ్డి వి
మల గుణములప్రోక గొప్పమర్యాదకుఁడా
వలమయి పండితుఁడయి పా
రలపల్లెకు గ్రామణిగవిరాజిలుచుండెన్॥ 30

కం॥ తనపయివారలపయి భ
క్తినిఁ; దనతో పాటువారి దెసఁ బ్రేమంబుం;
దనయను యాయినులందు ద
యను నరసాంబ కవిగి తగెనతనికి సతియై॥ 31

వ॥ ఇఁకఁ జిన్న వేంకటరెడ్డియు, 32

గీ॥ అన్నలన్న మాట కావంతయేనిఁ బ్ర
మాదపడియుఁ దాఁటఁ కాఁదట మెయి
మెలఁగుచెల్లకళల మెఱియయై గండఁడై
సాగదీయుచుండు శాస్త్రి వరుల॥ 33

వ॥ అతనికి భార్యయై,

కం॥ వినయ వినమితశరీరం
బును లక్ష్మీకరకటాక్షములునుఁ శాంతా
సనముంగలిగి నిరంతర
మును బసవాంబిక వెలుంగుఁబున్నెముపంటై॥ 34

కం॥ శ్రీయుత లక్ష్మారెడ్డికి
భూయస్తేజస్వి పుణ్యపురుషుండగు నా
రాయణరెడ్డీంద్రుఁడు నా
రాయణు నంశమున జన్మమందెను బేర్మిన్ ॥ 35

సీ॥ భవదీయవదనంబు పటుకవీంద్ర శ్రేణి
మానస సోత్పలచంద్రమండలంబు
భవదీయసదనంబు భారతీభార్గవీ
మహిళామణి కేళి మందిరంబు
భవదీయహృదయంబు భవ్యకృపారస
స్వర్ణదీవాహినీ జన్మభూమి
భవదీయసుయశంబు ప్రథితశాత్రవలోక
చక్రవాకవియోగ సాధనంబు

గీ॥ తావకీన సౌజన్యంబు దావకీన
భవ్యసద్గుణసంపత్తి వర్ణనంబు
సేయనౌనె! యంచును నుతిసేయుచుండ్రు
కవిచయంబునారాయణక్ష్మావరేంద్ర ॥ 36

శా॥ లక్ష్మారెడ్డికుమారరత్నము గుణాలంకారుఁడు విద్యాశ్రీ
లక్ష్మీవంతుఁడు ధైర్యసాహస సమాలంబుండుదారుండు శ
త్రుక్ష్మాభర్తృతృణానలుండు కడుధీరుండొప్పె నానాకళా
సూక్ష్మాంశగ్రహయాళువై సుకవిసంస్తుత్యప్రభావుండునై 37

సీ॥ సాగరంబా! నీదుసన్నిధి రత్నముల్
గలవన్న నెవఁడు మేల్గాంచినాఁడు ?

చంద్రుడా, నీలోన సరసామృతప్రవా
హంబున్న నెవడు లాభంబుఁబొందె?
శ్రీదుఁడా, నీకు విశ్లేష నిధానంబు
లున్నవన్నను లాభమొందె నెవఁడు?
అమరాద్రి! నీవు స్వర్ణమయంబనని విన్న
నాఁడిలోన నెవరికి నొరిగిపడెను;

గీ॥ లౌభ్యమున మానవులు దాపులకును రాని
యట్లు మూలలడాఁగి రత్యంతముగను
పుణ్యసాంద్రు నారాయణ భూపుదాత్రృ
తావివేషంబుఁగనియైనఁ ద్రపనుగొనరె? 38

ఉ॥ చందురమామలోని రుచిజాలమునంపిలి తేఁట; మల్లికా
బృందములోని స్వచ్ఛత; శిరీషములలోని మృదుత్వ సంపదల్
చెందిన చర్చన స్థగిత శైత్యముఁజేర్చి విధాతయొక్క చో
ద్యంబుఁజేయఁబోలును గడిందిమసిందలపంగ రెడ్డికిన్. 39

సీ॥ ఎక్కడఁ దానున్న నక్కడ వేమంది
చుట్టి కొల్చుచునుంద్రు శోభనముగఁ
దనరాక వినరాఁగ జనములు పొరుగూళ్ల
మేళంబుఁగొని యూరిబైలనుంద్రు
తనతీర్పుకడతీరుపనియెంచి దూరస్థు
లునువచ్చి తగవులు వినుచుచుంద్రు
తానుబస్తీకేఁగఁ దనపాద దాసులై
యుడిగంబు సేతురుద్యోగులెల్ల

గీ॥ దాతలకు మేలుబంతియై తనదు పేరు
వెలయఁ జందాలొసంగు వేవేలుదినము
సకలలౌకిక కార్య విశారదుండు
ప్రియగుణుండు నారాయణరెడ్డి నరుఁడు. 40

చ॥ తనవసియించుమండలము దాటియు, రాష్ట్రముదాటి రాజధా
నినిఁదగ హిందుదేశమును నీరధులంగడు దాటిదాటి వ
చ్చినఁగనిమెచ్చి మిక్కిలిగ శ్రీమతి విక్టోరియా మహేశ్వరి
జనమణి యిచ్చెఁబెటబిరుదుఁ జక్కగ నాతనిదానలక్ష్మికిన్. 41

గీ॥ లలిత మధుర భారతి, శౌర్యలక్ష్మి, సుమతి,
ధీరదృష్టి, సద్భక్తి, గంభీరత, దయ,
కీర్తిఁగూడి నారాయణ క్షితిపుఁడొప్పె
అష్టమహిషులతోఁ గూడుహరినిఁబోలి. 42

కం॥ ఆనారాయణరెడ్డి ధ
రానేత వివాహమాడె రంగాంబికనున్
శ్రీనాగాంబను లక్ష్మిం
బానారీమణిని భాగ్యవతులంబ్రేమన్. 43

వ॥ అందుఁ జ్యేష్ఠురాలు 44

సీ॥ మృతుఁడైన వెంటనే పతిఁబాసి సావిత్రి
యముని వెంటంబడి యరుగకున్న
అన్యాంగనాసక్తి నభవుచేగిరిజ య
ర్ధాంగి కృతగను జేయఁబడకున్న

ఆత్మశుద్ధ్యర్థమై యగ్నిప్రవేశంబు
నొనరింపఁగా సీత యొప్పుకున్న
పతినిచేఁ ద్యక్తయై తండ్రియింటికిఁ బోయి
దమయంతి పెండ్లికిఁ దలఁచుకున్న

గీ॥ శ్రీకరుండు నారాయణరెడ్డి దేవి
రంగమాంబకు సాటి నేర్పఱుపవచ్చు
నుపమయొక్కఁ గూడ లేకునికిఁ జేసి
నామె కామెనె సాటి సేయంగనగును. 45

వ॥ అంపు ద్వితీయురాలు. 46

సీ॥ సర్వమంగళకు నిశ్చయముగాఁ 'బరిణామ'
'మేకావళీమాల' గృహపతికిని
'దృష్టాంత' మగు సాధ్వీమతల్లుల కెల్ల
'సారంబు' సౌజన్యపూరమునకు
'రత్నావళి' స్వమందిరశ్రీకి భూదేవి
'ముద్ర' మహోత్క్రాంతి ముఖ్యములకు
'పరివృత్తి' ధర్మదేవతకు 'మాలాదీప
కంబు' శయ్యామందిరంబునకును

గీ॥ శ్రీకరుండు నారాయణరెడ్డి దేవి
నాగమాంబ యలంకరణంబయ్యె
భువినలంకృతికిం గ్రొత్తపోలుఁపుగూర్చు
నుచితదేశంబ యాపెకు యోగ్యవృత్తి. 47

వ॥ అందుఁ తృతీయ. 48

సీ. రాజదండము ప్రతిరాత్రముంబొందు పం
కజమునఁ బ్రభవించెఁగాదె లక్ష్మి
చిట్టుబుట్టాడుచుఁ జిరచిరలాడుచుఁ
జండియై తగుగాదె శర్వరాణి
తాతయాట ధవుంను తలవాకిటనునిల్చి
భాషించుఁగాదె? తద్వ్యాఘ్రధూటి
చనవిచ్చు మాత్రానఁ బెనిమిటి నెత్తెక్కి
కాలఁద్రొక్కుచునుండెఁ గాదె గంగ

గీ॥ శ్రీకరుండు నారాయణరెడ్డి దేవి
లక్ష్మమాంబకుసాటి సల్పంగఁదగుదు
రెట్టు? లుపమానమునకు మహీతలమున
వేరె యుపమానమున్న దే వెదకిచూడ? 49

కం॥ అలనాగమాంబ గర్భము
ఫలియింపఁగ వెలయు రెండు ఫలములు రుచి భా
తులుదగ శంకరరెడ్డియు
నలరు శివారెడ్డియనఁగ నాహ్వాయములచేఁ. 50

గీ॥ శాస్త్రములయందు సోదరుల్ సహజ శత్రు
వులుగ వ్రాసిన వ్రాఁతకుఁ బుడమియందు
సంభవించునవ్యాప్తిదోషంబు వీరి
భవ్య సౌభ్రాత్రమును గాంచుపట్టునందు. 51

వ॥ అందు ద్వితీయుండు 52

మ॥ ఉపకారంబునుబూని సోదరునకుం జేదోడువాదోడుగా
మెలఁగున్ మంత్రియుబంటునై; నిరతముంబ్రేమించుచుంబ్రేమవృ
ష్టులతోఁగైకొను నన్నునుండి గుణసందోహంపు భారంబునం
బలెసముద్దండయియుండు బెద్దలకువహ్వా! శ్రీశివారెడ్డితాన్. 53

వ॥ జ్యేష్ఠుండు.

సీ॥ ధర్మదేవత కార్య దర్శినిగానుండి
వసియించుచుండు నెవ్వానియింట
భారతీదేవి స్వవల్లకీలతఁగీర్తి
గానంబుసేయు నెవ్వానియింట
ఇందిరాదేవి సేవించునుగనుసన్నఁ
బనులుగావించుచెవ్వానియింట
నెల్లసద్గుణరాశి ఋత్విగ్గణంబుగా
వర్తించుచుండు నెవ్వానియింట

గీ॥ సరసకవితాలతాంగికి సకలకాల
మెసఁగు భోగగృహంబుగా నెవనియిల్లు
చారువృత్తి సంగీత విశారదుండు
ప్రియుఁడురసికుండుశంకరరెడ్డి యతఁడు 54

సీ॥ బ్రాహ్మణమాత్రుఁడభ్యర్థియైరాఁగ భా
వించుజన్మంబు తరించినట్లు

వేదశాస్త్రజ్ఞాతవిచ్ఛేయుఁదలఁచు స్వ
భవనసీమ పవిత్రపఱచినయట్లు
సంగీతశాస్త్రవిశారదుండరుదేర
స్మరియించుఁబెన్నిధిదొరికినట్లు
కవివతంసుఁడు దనగడపఁగాలిడనెంచుఁ
బ్రాక్పుణ్యతతిపంట పండినట్లు

గీ॥ వాఁకిటికివచ్చు బుధవరపంక్త్యంఘ్రిగణము
దనదుదాన పరీక్షకై దైవతంబె
యట్టిహాఫ్ఫలవచ్చిన యట్లు దలఁచుఁ
బ్రియగుణుండగు శంకరరెడ్డినృపుఁడు॥

సీ॥ కట్టియున్నాఁడాత్మ కరపంకజంబునఁ
గానంబడనిదానకంకణంబు
ఎత్తియున్నాఁడు వియత్తటీశిఖరమం
దత్యున్నతయశోజయధ్వజంబు
వహియించుచున్నాఁడు ప్రత్యహంబాసక్తి
నఖిల దీనోద్ధారయజ్ఞదీక్ష
కైకొనుచున్నాఁడ గణ్యాన్యగుణ గణ
ప్రాపితస్తుతిరూప బహుళ్ళసిరము

గీ॥ కొనుచునున్నాఁడు సత్కవికోటినుండి
విలువలేని మహాగ్రంథముల సతంబు
విమలమర్యాద్గల్యగోత్ర పవిత్రమూర్తి
ప్రియుఁడు రసికుండు శంకరరెడ్డివరుఁడు॥ 56

సీ॥ తనకార్య బీజముల్ తరువులై మూడుపూ
వులు నారుకాయలు గలుగఁజేయుఁ
దనగుణసందోహతంతుసంతతి నేసి
పలువలుగుట్టగాఁబఱచుచుండుఁ
దనవ్యవహారరథంబు చక్కఁగసాఁగ
ధాత్రిమైసార ధిత్వంబు నెఱపుఁ
దనదుసారస్వతఘనతృష్ణ వారింప
సత్కవికవితారసంబుఁ దెచ్చు

గీ॥ ప్రియుఁడు సోదరుఁడగు శివారెడ్డివరుడు
భవ్యకీర్తి పండితగేయ వర్తనుండు
ప్రక్కఁగూర్చుండి సంతసపఱపఁదన్నుఁ
శ్రీకరుండైన శంకరరెడ్డివెలయు॥ 57

గీ॥ అట్టిరసికావతంసుని నట్టి పెద్ద
దిట్టనట్టి సదాచారు నట్టిదాత
నట్టి యన్వయమండను నట్టి పుణ్య
పురుషు ముమ్మాటికినిఁజూడఁబోము భువిని॥ 58

క॥ ఆమహనీయుని కోమలి
శ్రీమతి లక్ష్మమ్మ బసివిరెడ్డికి వీరాం
బామహిళకునుం బుత్రిక
ప్రేమాధిష్ఠాన దేవిరీతిం జెలఁగున్॥ 59

సీ॥ తనమనోహరుని సుందర వక్త్రబింబంబు
నాదర్శఫలకంబుగాఁదలంచుఁ
దనభర్త సరసముగ్ధకటాక్షవితతిని
సర్వాంగములకు భూషలుగఁదాల్చుఁ
దనప్రాణపతికీర్తి తరుణీవతంసంబుఁ
జెలికత్తెగాఁగొని చెలిమిసేయుఁ
దననాథు సద్గుణఘట్టంబు నరసిహో
రోద్యాన సీమగా నుంచుకొనును

గీ॥ తనమహృదయేశుఁగూడిసత్కవి కిషిస్వ
ఫుష్పరథముల విహరింపఁబోవుచుండు
దీనజనకల్పవల్లి సతీమతల్లి
సరసగుణములదీవి లక్ష్మమ్మదేవి॥ 60

ఉ॥ బిడ్డలులేమిసద్గతిలభింపదయన్నభయంబుచేత నీ
రెడ్డికులాగ్రగణ్యుఁడు వరించిగ్రహించెను ధర్మపత్నిగా
దొడ్డపడంతిపార్వతమ దుష్టపుఁగామముచేతఁగాదయా
ఒడ్డయసంగనాయమయుఁ బావనమూర్తిసతీచయంబునన్॥ 61

కం॥ ఘనుడాశంకరభూపతి
వనితామణియైనయల్లపార్వతివలనన్
దనయుంగనెఁబార్వతియం
దనఘుఁడు శంకరుఁడుతారకారినిఁబోలెన్॥ 62

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

## ప్రథమాశ్వాసము.

కం. శ్రీలక్ష్మీధవచింతా
లోలాత్మ! లసచ్చరిత్ర! లోకోత్తర! యు
ద్వేల గుణోజ్జ్వల! కీర్తి వి
శాలా! మహనీయ తేజ! శంకరరెడ్డి! 1

వ. అవధరింపుము. త్రికాలజ్ఞుండైన నారదమునీంద్రుఁడు వాల్మీకి మునికిట్లని చెప్పందొడంగె. 2

గీ. ధర్మదేవత పుట్టి; ల్లుదగ్రవేద
ఖనులకాణాచి; భువిస్వర్గఖండ; మార్య
భాగ్యముల సీమ; కృతయుగ ప్రసవభూమి
మిథిలయను పత్తనంబు భూమినిఁ జెలంగు. 3

ఉ. ఆకుల పళ్లెరంబులను హారతి దీపముల్గట్టు పూవులం
దేకువఁబూని వేణుగళనిస్సృతమౌ మధురస్వరంబునం
బాకముగల్గు పాటలను బాడుచు నారతులిచ్చి చేతుఁపు
త్స్నేకముతో వనాంగనలు దీవనఁదన్నగరీమతల్లికిన్. 4

గీ. బ్రాహ్మణులు వేదపాఠవర్షములు గురియఁ
గల్మషంబులు గాల్వలు గట్టిపాఱు
బ్రహ్మవేత్తలు జ్ఞానాంకురములు సల్లి
పంటపండించుచుందు రా పట్టణమున. 5

శా. సాయాహ్నంబులనందు వాఁకదరులన్ సాంధ్యక్రియల్ తీర్చినాఁ
డే యేసాధనలాచరించికొనిరో! యేశ్రోత్తలం గాంచిరో!
ఆయావాని వచించుకొంచుఁజనుచుంద్రంధమ్మకా బ్రాహ్మణుల్
మాయంబోలెనుముండ్లకొమ్మలను దన్మార్గాన నొత్తించుచున్. 6

గీ. తారకాచంద్రసూర్యులు దమతపోవి
శాలతేజస్సు చాలమింజాలఁగుంద
దివ్యమూర్తిని దర్శించి దేహమర్త్య
ముగనిడిన ఋషులీపుణ్యభూమివారు. 7

గీ. పావురముపల్లటీల్గొట్టి పఱచునట్లు
తీఁగఁగమ్మెచ్చు ననుసాగ దీయునట్లు
ఒడిసెలను రాయి విసరెడునోజనచట
గానమును జేయఁగలవారు గలరు మిగుల. 8

గీ. జీవకళలను గురిపించు చిత్తరువులు
వ్రాసి పురలక్ష్మి తన శరీరమునఁ దాల్చు
భూషణంబులు నాగృహంబులను వ్రేలఁ
గట్టుదురు శిల్పిముఖ్యులా పట్టణమున. 9

గీ. తను స్వయంవరమున వరించిన కవిత్వ
రమణితోఁగూడి ప్రకృతి దృశ్యముఁగనుచు
గోయిలలపాటలను సుతిఁ గూర్చి కవులు
పాడుకొనుచుంద్రు పూలచప్పరములందు. 10

ఉ. గానముఁ జిత్రలేఖనమఖండ కవిత్వమహత్త్వ సంపదం
బూనిన పండితుల్ ధనముపొంచెను లాఁతులకమ్ముకోక వి
ద్యానిపుణత్వమచ్చుపడఁదారె యథేచ్ఛగఁ గూర్చుచుంద్రుల
క్ష్మీనిధులేఁగుదెంచి కనిమెచ్చి ధనంబుల నిత్తురావురిన్. 11

గీ. అచటి రసికావతంసంబులరయఁ బెంచు
భవన కలహంస మధురారవంబులల్ల
మదనకామేశ్వరీ మహామంత్ర పాఠ
మునకు బీజాక్షరంబులై పొలుచుచుండు. 12

సీ. గర్భంబునను రత్నకాండంబుగల భూమి
ప్రభవించు రత్నాంకురంబులనఁగ
నమృతాంశుమండలంబంతయుఁ గరఁగించి
పోఁతపోసిన యాటబొమ్మలనఁగ
స్మరుఁడు శృంగారరసంబునంబెంచిన
బాలశంపాలతాజాలమనఁగఁ
గామదేవాలయాగ్రంబుపై నెత్త సం
కల్పింపఁబడిన శృంగంబులనఁగ

గీ. స్మరుఁడు జలకేళి సవరించు సరసులనఁగఁ
దనువుఁదాల్చిన మదనమంత్రంబులనఁగ
నుర్వ్రాతాసారమెల్లఁ బైకుబికెననఁగ
నటవిలాసిను లొప్పుదురద్భుతముగ. 13

గీ. రసికులేఁగెడు తఱిని మార్గమున వాంప్రప
పనిమిషను నిల్చి గృహబహిర్ద్వారమందుఁ
జారు తన్ముఖరాకా నిశాకరులకు
నెపుడు చూపుల హారతులిచ్చుచుంద్రు. 14

సీ. పొగబండి పోవునప్పుడు ధూమచయము ప్రై
పరువెత్తి వెనుకకుఁ గురులుగాఁగ
రసికులపైనను రక్తిఁ బువ్వులఁజల్లు
చున్నట్లు దగఁగటాక్షోచ్చయంబు
చెట్లకొమ్మకుఁబ్రాఁకఁ చేరుతీవియలట్లు
పైకెత్తబడియుండ బాహుయుగము
తలక్రిందుగా మింట మొలచినరక్తోత్ప
లములట్లు వెలయఁ బాదములజంట

గీ. లేఁతనవ్వులుమింట మల్లియలుపూయఁ
గట్టు పుట్టంబుమడతలు గాలిఁగదలి
మెయి మెఱుఁగువాఁకతరఁగలహొయలుగులుక
యువతులువనాల నుయ్యాలలూఁగుచుంద్రు. 15

ఉ. గాలికిఁదాండవించుచుఁదరంగ్రబసరించెడు జమ్మునూఁగులం
బోలెను, దూదినేకుతతిఁబోల్చెడు పింజలమాండ్కిఁగా, నుషః
కాలపుమూఁడమంచుసరిగా దెసలన్నియు నావరించి స
ర్వాలయభాగముల్ తనమయంబుగఁజేయునువర్తిధూపముల్. 16

సీ. గండుఁగోయిలపిండుగానామృతంబుచేఁ
జిగురువెట్టుచునున్న చెట్లగుంపు
ప్రణయమంత్రంబుచే వశవర్తులయి పర
స్వరముముచ్చటలాడు పడుచువాండ్రు
వేణునాదంబుచే వెనువెంటఁబడివచ్చు
పసులతోఁజనుపిల్లవాండ్రమూఁక
వాహ్యాళికరుగుదంపతులను గనినవ్వు
చేలపాటలఁబాడు నెమ్మికాండ్రు

గీ. ఇంక నానావిధంబులు వారలెంతమంది
నో! మరెన్నెన్ని కౌతుకంబుత్సవిల్లఁ
జేయున వ్వల్లఁగనవచ్చుసాయములను
నారిబయలికి విహరింపఁగోరిచనిన. 17

మ. చినుకుల్ చిమ్మెడువారియంత్రములోఁగిం జెన్నారఁగాఁదోఁటఁజు
ట్టును సోపానములందుఁదోట్లఘవుఁజెట్టుల్ పొల్పుదృశ్యంబులై
వనకాంతామణి నేరటాంగ్రపురటోగింబన్నిరముంజల్లుచుం
డనదా చుట్టును గూరుచుండ నిడియుండంబోలునూ
హింపఁగన్. 18

కం. తనరిపుభూపతి కోట్టము
లనుదాఁ బ్రవ్వించియును శిలాముఖసామ
గ్రినిఁగొనికోటను గట్టెను
జనకుఁడు భృతకరులఁజేసిశాత్రవపతులన్. 19

గీ. ఆకసమునంటెఁగోటయటన్నఁగాని
పరిఖపాతాళమంటెనన్ పలుకుగాని
యతిశయోక్తంబులితరత్ర యాపురమున
నవిస్వభావోక్తములు నిశ్చయంబునుండి! 20

ఉ. ఆజనకక్షితీశ్వరు సభాంగనమందున మూర్తిమత్తప
స్తేజములైన బ్రహ్మఋషిశేఖరులాఁదటఁగూరుచుండి యు
త్తేజముగల్గునట్టి యుపదేశములిచ్చుచుఁ బోవుచుందురా
రాజు మహాప్రసాద'మని శ్రద్ధగఁజింతనసేయువానినిన్. 21

గీ. బ్రహ్మవిద్యాసమాలబ్ధ బ్రహ్మవర్చ
సాన్వితమహర్షివరుల కటాక్షమందు
నేప్రభావంబుగలదొ? లేదేని భోగి
యైన రాజెట్లు యోగిగానౌను? దలఁప. 22

కం. మునిఘనులాశీర్వృష్టుల
ననయముఁ గురిపింప రాజ్యమంత సుభిక్షం
బునుబొంది సస్యవృద్ధినిఁ
గొని సర్వైశ్వర్యములకుఁ గుదురుగ నిలిచెన్. 23

గీ. పంచమామ్నాయము; చతుర్థపావకుండు,
జంగమంబగు తీర్థంబు; సంచరింప
మూర్తిగైకొన్న ధర్మంబు; పుణ్యధనుఁడు
కౌశికుఁడు దత్కుటుంబాధికారమూను. 24

గీ. గౌతమ మహర్షి పుత్త్రుండు, పూతవృత్తి;
అధిగతాఖిల బ్రహ్మవిద్యారహస్యుఁ;
డగు శతానందముని జనకాన్వవాయ
మునకును బురోధయై శుభంబులనుగూర్చు. 25

వ. ఆ జనకునకు సీతయనుపేరి కూఁతురుగలదు. 26

గీ. స్తంభము చిగిర్చినట్లు; చిత్తరువు బొమ్మ
గోడపయి వ్రాయఁబడినట్లు; గుమ్మమందు
ఘటవిటపినిల్చినట్లుగాఁ గానిపించు
సీత నిలఁబడియుండ నాసీమలందు.

చ. జడవిడిపోవ వెంద్రుకలజాలము విప్పిన బర్హిపింఛపుఙ్
వడువున, మేరుశృంగరపరభాగమునుండి నితంబసీమపైఁ
బడుచునధస్పదంబునకుఁ బారెడు నీలజలప్రవాహపుఙ్
వడువునఁదోఁప నెల్లరకుఁబట్టఁగరాని ముదంబుగూర్చెడున్. 28

వ. కాలంబు గడచి యేఁడుపయి నేఁడువచ్చి యాసీతా
కుమారీ రత్నంబునకు యౌవనావిర్భావంబు దోఁచె. 29

గీ. శక్తిసంపన్నమైయుండఁ జాలలేక
దూరదూరంబుగాఁ బాఱి, తూలిపోవ
నెదిరిబలమెల్లఁ జూచి దండెత్తివచ్చి
యాక్రమించెడు రాజుసూ యౌవనంబు! 30

గీ. సారసాస్త్రిండు నానైంద్ర జాలికుండు
పూవుఁబోండ్లపై యౌవన భూతిఁజల్లి
రూపభావాలనువ్వొత్తు క్రొత్తమార్పు
గలుగుఁ జూపఱుకడిఁది యక్కజముపడఁగ. 31

గీ. స్వర్ణ పుత్త్రికైయైన యాజనకతనయ
యంగవల్లికి స్మరశిల్పి యౌవనంపు
మెఱుఁగుఁబెట్టఁ గన్నుల మిఱుమిట్లుగొలుపు
తళతళలమించి సౌభాగ్య నిలయమయ్యె. 32

సీ॥ నడుము వైశాల్యంబు నాఁచెను జఘనంబు
కాఁజేసె జఘనంపుఁ గ్రశిమ నడుము
చనుల సూక్ష్మత్వంబు గొనిపోయెనుదరమా
యుదరంపు స్థౌల్యంబునొందెఁ జనులు
కనుల యార్జవమును గైకొనె నూఁగారు
నూఁగారుకుటిలతలాగెఁ గనులు
అడుగులచపలతహరియించెఁదలఁపులు
తలఁపులజడను దొద్దగొనె నడుగు

గీ॥ లభినవంబుగఁ రాజ్యాభిషిక్తుఁ
డైన కందర్పుఁ బరికించి యాక్షణంబె

యానెలంతయంగంబులన్యోన్య మిటులు
చూఱలాడిన గతిఁదోఁచు జూపఱులకు. 33

వ. అట్టియెడ నాకుమారీమణి 34

అనయంబుం గనతండ్రి కొల్వునకు యాచ్ఞార్థంబు దోఁతెంచు స
త్సనబృందంబులవల్ల నాదశరథక్ష్మాభర్తకుక్ ధీనిధుల్
తనయుల్ నల్వురు; వారిలోఁ బ్రథముఁడు దాముంపు రాముండుచ
క్కనివాఁడద్భుతవిక్రముండు గుణవిఖ్యాతుండటంచుక్ వినెక్. 35

గీ. వినినమాత్రనె యాతనిఁగనినయట్లు
రూపరేఖా విలాసంబు లాపెమదికి
భావనాగోచరములైన వాస్తవములె
కానఁబడిచేయుఁబవలును గలచుఁచుండె. 36

వ. మఱియు, 37

మ. ధనువుక్ హస్తమునందు వెన్కశరధిద్వంద్వంబు వక్షస్స్థలం
బున స్వల్పంబగు భస్మరేఖఁగటినిక్ ముంజిం బ్రతిష్ఠించి మో
మున లక్ష్మీకళతాండవింప నయనంబుల్ కర్ణముల్ తాఁకి నా
సనపుం బ్రాయమునూఁగుమీసములుదద్దం దెల్పుచుండంగ క్. 38

గీ. క్షత్త్రియ బ్రహ్మచారి యొక్కరుఁడు వెనుక
వెనుకగావచ్చి యాలేమకనులుమూయుఁ
బట్టి ముద్దాడుఁ బయ్యెదఁబట్టి లాగుఁ
గొలుపుఁ జక్కిలిగింతలు గలలయందు. 39

గీ. వదనమానాఁటికానాఁడు వాలిపోయె
వరలుమోదీవ చెలువఱి వాడిపోయెఁ

గనులు గుంటలువడెను వికాసమడఁగె
జిత్తమున నేమిహాత్తెనో? సీతకిపుడు. 40

గీ. తనదు పూజాగృహంబునఁ బనులనెల్ల
యువతి తబ్బిబ్బుగాఁ జేయుచుండఁజూచి
జనకుఁడైనట్టి జనకుండు సంగ్రహించె
దద్రహస్యార్థమంతయుఁ దత్క్షణంబె. 41

చ. పరిణయముంబొనర్పఁదగు ప్రాయమువచ్చినదంచెఱింగి భూ
వరుఁడు కుటుంబనాయకుని భవ్యతపోధను గాధిసూను నా
దరమునఁ బిల్వనంపియు నతండరుదెంచుడు నర్ఘ్యపాద్యముల్
జరిపి నమస్కరించి శిరసావహియించెను బాదరేణువుల్. 42

గీ. బహు తపః ప్రభావప్రగల్భంబులయిన
దృష్టులను జల్లుచున్నట్లు, తీర్థజలముఁ,
బుణ్యములఁ దాకుచున్నట్లు పూర్వశుద్ధి
సేయుచున్నట్లు మునియు వీక్షించిపలికె. 43

చ. జనక! నిరంతరాయముగ సాగుచునున్నవె? నీతపస్సు సా
ధనలును, బుణ్యకర్మములు, దానజపంబులు, నగ్నిహోత్రముల్
జనములు పాపభీతులయి సంచరియింతురె? రాజభక్తి గ
ల్గినసచివోత్తముల్ గలరె? లేదుగదా పరరాష్ట్రబాధలున్. 44

గీ. అనుచు సంప్రీతిఁబ్రశ్నింప జనకనృపతి
యంజలిఘటించినమ్రుఁడై యధికభక్తి
నఘటనాఘటనాపటీయః ప్రభావు
లగుమునుల చూడ్కిమమ్మేలనగునె కొఱత? 45

•వకాని యభ్యర్థనీయంబుగలదది యెద్దియందురేని 46

పెండిలియాఁడువచ్చినది బిడ్డకు సీతకు రాక్షసాధి నా
థుండు, మహేశ్వరార్చనరతుండు, బలిష్ఠుఁడు నాకుఁబ్రాణ మి
త్త్రుండగు రావణుండు దనదూతలఁగన్యను గోరఁబంప నె
ల్లుండుదునిచ్చి యీయకెటులుండుదు నేమని చెప్పిపంపుదుఁ. 47

గీ. అతఁడు సాధారణుండుగాఁడా శశాంక
శేఖరుని శైలమెత్తఁ బూఁజెండురీతి
సంభ్రమాయత్త పార్వతీ సాంద్రబాహు
బంధహర్షితుఁడై శూలివానిమెచ్చె. 48

సీ॥ అతఁడు సామాన్యుఁడే? మహాఖ్యాతిపరుఁడు;
విశ్వసృగ్వంశ జాతుండు, విశ్వజేత;
శతమఖుండును జెల్లించు శాసనంబు;
పంచభూతంబులును భయంపడుచునుండు. 49

సీ॥ అతఁడు కేవలుఁడే? జగత్త్రితయవిశ్రు
తస్థిరశ్రీవహుండు; దుర్ధర్ష తేజుఁ
డమరయువతులబందీ గ్రహంబొనర్చి
భృత్యులనుజేసెవారి భర్తృతతినెల్ల. 50

గీ. జగతియందునఁ బ్రతివస్తుజాతియందు
శ్రేష్ఠమెయ్యదియో యదిచేరువాని
నర్థిభావంబె కనఁబడదతనియందు
నాతని యనుగ్రహమె యెల్లరభిలషింత్రు. 51

కాపునముందునూయి వెనుకంగనఁగోయియుఁ దోఁచుచుండెనా
కేవిధిమానసంబునకు నేర్పడకున్న శాంతి; బిడ్డయుం

జీవను బాసియెల్లపుడుఁ జింతవహించెదు నేదిహేతునో?
భావమునందు! నాహృదయభారముమాన్పుముదంబొనర్పవే! 52

మ. అనిదైన్యంబును వెల్లఁగుక్కుకొనఁగా నాగాథముత్తింపుడున్
వినిజాలింబడి దివ్యదృష్టివలన్ వీక్షించి సీతామన
స్సున నేర్పడ్డ వికారబీజమునుహృష్టుండై స్వకార్యంబునం
దనుకూలంబుగనుండె దైవమని తానారాజుతో నిట్లనున్. 53

గీ. దీనభావంబు మానుమదృష్టవంతు
రాలునీబిడ్డ; పండెనీదైనతపము
అల్లభూదేవికిని స్వాస్థ్యమబ్బునింక
బెడఁదలన్నియు మునులకు నడఁగిపోవు. 54

గీ. మూర్తమగు క్షాత్త్రతేజంబు; పుణ్యరాశి
శమధనుఁడు; వీరవరుఁడు; విశ్వప్రియుండు;
అస్త్రవిద్యావిశారదుండైన రామ
చంద్రుఁ బ్రేమించె నీయాత్మజాతమదిని. 55

గీ. సీత నిక్కంబుగా లక్ష్మి, శ్రీకరుండు
రామచంద్రుండు నాదినారాయణుండు;
పరిణయబంధంబు జన్మాంతర ప్రయాస
మభిమతంబీప్రబంధ మింద్రాదులకును. 56

వ. ఆ రామచంద్రుం డెవండంటివేని 57

చ. త్రిభువనజన్మభూమియగిదిన్ బహువిస్తృతిఁగల్గి పుణ్యసా
రభముగలట్టి మర్త్యనికరప్రసవంబులు పూచుతోఁటయై
ప్రభుతవహించి సర్వనగరంబులపై సిరిదేవతాపురీ
నిభమయిపత్తనంబుధరణీప! యయోధ్యయనంజెలంగెడున్. 58

గీ. ధర్మసురగంగప్రథమావతారభూమి
సారభూమి ధరిత్రి; కాస్థానభూమి
రఘుకులక్షత్త్రియుల దివ్యరాజ్యలక్ష్మి
కాపురంబేలు దశరథుండను నృపుండు. 59

సీ. భూధ్రంబువోలె సమున్నతుండగుఁగాని
కొమరారఁగస్వభావకోమలుండు
తపనుండువోలెఁ బ్రతాపశీలుఁడుగాని
చల్లఁదనంబుఁ బైఁజల్లువాఁడు
సముద్రంబువలె లచ్చికాణాచియగుఁగాని
స్తవనీయసద్వంశసంభవుండు
శశిభంగిలోకప్రసన్నరూపుఁడుగాని
నిష్కళంకుఁడు సదాపుష్కలుండు

గీ. ఆత్మవంశప్రదీపకం బాద్యచరితుఁ
డుత్తమోత్తమగుణసంచయోజ్జ్వలుండు
వంశపావనకరుఁడు భూపాలవరుఁడు
తతయశోమండనుండు దద్దశరథుండు. 60

సీ. స్వభుజంబులను శత్రుచయనాశధూమకే
తువులఁజేసిన యుద్ధతుండతండు
అలప్రతాపాగ్నితో సాగ్న్యాహితుండయి
పొలుపొందు విక్రమభూమియతఁడు
అరులఁబసులఁజేసి యాహవాధ్వరములఁ
గెరలఁజేసిన కర్మపరుఁడతండు

సామంతనృపకృతోద్దామోపహారముల్
భూకాంతకిడిపొందు బాజుఁగతంబు

గీ. సుగుణముక్తామణీహారశోభియతఁడు
వేదశాస్త్రకళాబృంద వేత్తయతఁడు
జ్ఞానసంపన్నుఁడు మునీంద్రసన్నుతుండు
తగుఁబ్రజారంజకుండయిరశరథుండు. 61

కం. కలరానృపతికిమువ్వురు
కళత్రములువారువరుసగాఁగౌసల్యా
లలనామణియుసుమిత్రా
బలామణియుఁగైకయనఁగఁబరఁగిరిపేర్మిన్. 62

ఉ. కోసలదేశరాజునకుఁగూఁతురుపెద్దది,మాగధావనీ
శాసకుబిడ్డరెండవది; క్ష్మావర! మూఁడవయాపె కేకయ
క్ష్మాసఖుపుత్త్రి; వీరిగుణకాండము వీరిపతివ్రతాత్వమ
భ్యాసముసేసినప్పటికిఁబట్టవులాఁతులకీజగంబునన్. 63

గీ. సవతిపోరులులేవతిస్వల్పమేని;
లేదుమనమందభిప్రాయభేదలవముఁ
బుడమి నొకతల్లికడుపునఁబుట్టినట్టి
యప్పసెల్లెండ్రునేనియట్లొప్పబోరు. 64

ఉ. మువ్వురుభార్యలున్; బహువిభూతిసమృద్ధులు; సౌఖ్యబీజముల్
పువ్వులతోఁటలున్; భవనముల్; పరిపూర్ణములైనభోగముల్
అవ్వసుధాపురందరుని యాత్మకుశాంతినిఁగూర్పకుండె; నే
నెవ్వగయోమనంబున జనించిదహించుచునుండనాతనిన్. 65

కం॥ ఆనందమునకుడెందమె
స్థానంబుగనుండు ధనము, జలజాతాస్యల్,
మానితరాజ్యసుఖంబులు,
గానిస్థానములుగావు పరికింపంగన్. 66

గీ. ఆత్మశాంతికిఁ బ్రతిబంధమైనయట్టి
ఘనువిచారరంబునకు నేది బీజమనినఁ
గనులపండువుగాముందుగంతులిడుచుఁ
దాండవించుచునుండు పుత్త్రకులు లేమి. 67

చ. ప్రమదరసంబునుక్షణముఁ బడఁజల్లఁగఁ జల్లువారియం
త్రము, తనజీవితంపు సుఖరాశికిఁ గేంద్రము, ప్రేమవాహినీ
సముదయముల్ స్రవించిపడుసంద్రము, మానసశాంతివేశ్మమౌ
కొమరుఁడు లేనివాని బ్రదుకున్ బ్రతుకే? తలపోసిచూడఁగన్. 68

గీ. కసువుపిసుకఁ గిండియుఁ గాలినిండ
గుడ్డయును లేని వారికి బిడ్డలనిడి
తినఁగఁ గట్టఁగ సుఖముగా ననుభవింప
నున్నవారికి విధియీయఁడొక్క మొలక. 69

గీ. సంతపించుచుఁ బుత్త్రులకొఱకు నాతఁ
డశ్వమేధంబుఁ బుత్త్రార్థ మాచరింతు
ననుచు దృఢనిశ్చయుండయి తనసుమంత్ర
మంత్రిముఖ్యులతోఁ దెల్పె మనసుకోర్కె. 70

వ. అంతట వారలో మహారాజా! నీకుఁ బుత్త్రులుదయించు నుపాయంబు దెల్పెదము. కాశ్యపుని మనుమండును, విభాండకుని పుత్త్రుండును, అఖండతపస్సంపన్నుండగు ఋష్యశృంగుండను తపో

ధనసత్త్వముండుగలఁడు. అతండు నీవపత్యంబుగాఁ బెంచుకొనినిచ్చిన రోమపాదుని కూఁతురగు శాంతను బెండ్లాడెను. ఆమహాభాగుని రోమపాదుని గృహంబునుండి రప్పించి యజ్ఞంబుఁ గావించితివేని నీకుఁబుత్త్రోత్పత్తి తప్పక కలుగునని చెప్పిన, 71

గీ. దశరథుఁడు వల్లెయనుచు సంతసమునొంది
రోమపాదు గృహంబు మంత్రులును దాను
బోయి యచ్చట మేధ్యాగ్ని పోల్కినున్న
ఋష్యశృంగుంగని నమస్కరించి నిలచె. 72

వ. మహర్షియు నాశీర్వదించి వచ్చిన పని యేమని యడుగుడు నానృపాలుండు 73

శా. "సంకల్పించితి నశ్వమేధమునొగిన్ సాధింపఁ బుత్త్రార్థినై
పంకేజాస్యను శాంతఁ దీసికొని దేవా! నీవు విచ్చేసి యా
తంకంబేర్పడకుండ యాగము సమాప్తంబున్ రచింపింపు" నాన్
సంకోచింపక ఋషశృంగుఁడరిగెన్ శాంతా సహాయుండునై. 74

గీ. యాగదీక్షను వహియించె నానృపుండు
మువురు భార్యలతోఁ, దపోమూర్తి ఋష్య
శృంగుఁడాధ్వర్యవముఁబూని ఋత్విగాళిఁ
గూడి వేల్పందొడఁగె హోమకుండమందు. 75

గీ॥ ఒక్కరొక్కరుగా వేల్పులక్కడకును
వచ్చి హుతములుగొని తృప్తిపడుచుఁజనిరి
కమ్మనెత్తావి రోదసింగడలుకొనెను
మంటమొత్తమ్ము లాకాశమంటుచుండె. 76

గీ. ఆమహాజ్వాలజాలమధ్యంబునందుఁ
గనక విగ్రహమట్లు; భాస్కరునిబింబ
మందువెలుఁగొందు విష్ణువునట్లువెడలె
దివ్యపురుషుండుసర్వతో త్సేధుఁడొకఁడు 77

గీ. పొలుచుచుండఁగఁ బాయసపూర్ణపాత్ర
పాణియందునఁ బ్రియమైన పత్నిఁబోల్కి
నంత సాక్షాత్కరించి తానమరదుందు
భిస్వనముఁగీడుపఱచుచుఁ బ్రీతిఁబలికె. 78

వ. „నేను ప్రాజాపత్యపూరుషుండను. దేవతలుపంపవచ్చితిని. ఈ పాత్రయందలి పాయసంబు ప్రజాకరంబు. దీనిని నీభార్యల కిమ్ము." అని యెల్లరాశ్చర్యపడుచుండఁ బాత్రమొసగి యంత ర్ధానంబునొందె. భూవరుండును మహాప్రసాదంబని గ్రహించి యాగంబు నిర్వర్తించి యాపాయసంబుఁగొనిపోయి సంగోరు కౌసల్యకును, దక్కసాఁబాలసర్ధంబు సుమిత్త్రికును, అవశిష్టార్ధమున సగము కైకేయికిని, మిగిలిన సగము మరల సుమిత్రకును నొసంగి హృష్టుండయ్యె. వారును దత్పాయసభక్షణంబున గర్భంబులుధరించి నవమాసంబులు మోసి కౌసల్య శ్రీరాముని, సుమిత్త్రిలక్ష్మణశత్రుఘ్నులను, కైకేయి భరతునిఁగనెను. 79

మ. అమృతస్నానముసేసి; నక్లైదియొ తమ్మాశ్లేషముంగొన్న చం
దమునన్; దేహమునిండఁగాఁబరిమళద్రవ్యంబులంబూసి న;
ట్లమరంజంద్రికసౌరభాన్వితముగా వ్యాపించుచున్నట్లుగా
నమితానందమునొందిరాసమయమందాతల్లులుందంద్రియున్ 80

గీ. వారుజనియింపఁగానె దేవతలుపుష్ప
వృష్టిఁగురిసిరి; సమ్మదావేశమునను
స్వర్ణవృష్టినిఁగురిపించె క్ష్మావరుండు
ప్రజలపయి వారిభాగ్యంబుపండెనాఁడు. 81

గీ. వారినలువురిలోపలఁబ్రథముఁడైన
రామచంద్రుండు దండ్రికిఁబ్రేమమయుఁడు
ప్రాణితతియందు శ్రేష్ఠుఁడౌబ్రహ్మయట్లు
క్షత్త్రియాన్వయములకు భూషణమతండు. 82

గీ. ధైర్యమునకు ధామంబు; సత్యప్రవాహ
మునకు సేతువు; సద్గుణంబులకు దర్ప
ణంబు; ప్రతినిధి హరికి; స్థానంబుస్థితికిఁ
జదువులకువాణి; శ్రీరామచంద్రమూర్తి. 83

శా. ఆకర్ణాంతవిశాలనేత్రయుగుఁడత్యాభోగవక్షస్కుఁడున్
శ్రీకల్యాణగుణాకరుండును, ధనుర్విద్యాసమర్థుండు, సౌ
మ్యాకారుండు, మునీంద్రసమ్మతుడు, దివ్యద్దివ్యతేజస్వి, యి
క్ష్వాకుశ్రేష్ఠకులుండు వెల్గు నిరహంకారుండు రాముండిలన్. 84

గీ. కువలయశ్యామలాంగుండు, క్షోణిపాల
నోచిత పదాబ్జభవ్యచిహ్నుండు, ఘనుఁడు,
క్షాత్రధర్మస్మృతులకునాచార్యవరుఁడు
రామచంద్రుండుదాత్తవర్తనుఁడుసుమ్ము. 85

గీ. అన్నదమ్ములు నలువురన్యోన్యమాత్మఁ
బ్రేముడినిఁగల్గితారువర్తిల్లుచున్న

రామలక్ష్మణులకును బరస్పరంబు
భరతశత్రుఘ్నులకు బరస్పరము హెచ్చు. 86

వ. ఇట్లుండవారు యథాకాలంబు చౌలోపనయనాది సంస్కారం
బులుగావింపఁబడిన పిమ్మట నేనుబోయి యారామలక్ష్మణులనా
యాగరక్షణార్థంబుగొని తెచ్చి సర్వవిద్యలు గఱపిధనుర్వేదంబు
సాంగంబుగా నధ్యయనంబు సేయించి భగవానుండగు కృశా
శ్వముని ప్రసాదంబుననాయభ్యసించిన సరహస్యజృంభక ప్ర
యోగోపసంహారంబులుగల దివ్యాస్త్రమంత్రపారాయణము
యొక్క విద్యాతత్త్వబీజంబులుపదేశించితిని. 87

ఉ. సీతకురాముఁడేతగినచెల్వుఁడు; రామునిధర్మపత్నికా
సీతయెతగ్గ; దిద్దఱకుఁజెల్లును; జిల్కయుగోరువంకయుఁ
భాతిగ, నింద్రనీలమును వజ్రమునట్టులు, శాంతి తేజముల్
రీతిగనుండి కన్నులకుఁబ్రీతినొసర్తురు చూచువారికిన్. 88

కం. స్థిరపఱచియుంటి నిట్లీ
పరిణయసంబంధమెపుడువారిద్దఱినిం
బరికించితినో! యప్పుడె
ధరాపురందర! యింకేల? తడవుకొనవలెన్. 89

గీ. కన్యకార్థంబుయాచింపఁగాఁబులస్త్య
పుత్త్రుఁడేతెంచుటకు ముందెముఖ్యముగను
సీతపెండిలిఁగావింపఁజూతువేనిఁ
దక్కునాందోళనమునకుఁదావులేదు. 90

ఉ. పెండిలిమాటరావణుఁడువిన్నఁగడుంగడుమోసమౌను; గా
నండకడొంకుఁబన్నదము, యాగముపేరిడిమీరు చూడఁగా

రండుమదాశ్రమంబునకు రామునిలక్ష్మణువారి తల్లులం
దండిరిఁదోడితెత్తును బొనర్పువివాహము వారికచ్చటన్. 91

గీ. పెండ్లియైనపిదప విని రావణుండెంత
మండిపడిన నీదు ఖండపరశు
భక్తి వాని శాంతపఱుపంగఁజాలును
గాలుచిచ్చువర్షధారవోలె. 92

వ. ఇదంతయునాకపటంబని యెఱింగినను నన్నేమియుఁజేయఁజా లఁడు. కాన నీవు వెఱవకుము. ప్రయాణమునకు సంసిద్ధుడవు కమ్ము. నేనుసాకేతమునకుఁబోయి దశరథునిఁగళత్ర పుత్ర బంధుసమేతముగాఁగొనివత్తు. ఈరహస్యంబుఁబొక్కనీకుమని నొక్కి చెప్పె. 93

గీ. జనకరాడ్వంశరఘువంశజాతులకును
వెలయుసంబంధ మేరికిఁబ్రియముగాదు?
దాతయుఁ బరిగ్రహీతయు దానియందు
స్వయముగాఁగౌశికుండయి పరిఢవిల్లు. 94

చ. జనకుని నెత్తి బర్వముని చంద్రుఁడు నెత్తినిఁదాల్చి తత్సమ
ర్ధనమునొనర్పఁ గంకణముఁదాల్చినరీతిగ మాటలాడ రా
జునుమునియుక్తి మెచ్చుకొనుచున్ బహుభంగులఁబూజనంబులం
దనిపియువీడుకొల్పి పయనంబునొనర్పఁగ లోనికింజనెన్. 95

వ. చని సీతాకుమారికి సహాయార్థంబుగా నూర్మిళామాండ వీశ్రుతకీర్తులను గూడఁ దోడ్కొని కతిపయ ప్రయాణంబుల విశ్వామిత్రుని యాశ్రమంబుఁజేరెను. అని నారదుండు చెప్పినవిని వాల్మీకముని 96

శా. శ్రీనారాయణరెడ్డి రోహణ ధరాభృజ్జాత రత్నాంకురా!
నానాపండితమండలీ వినుతదానప్రౌఢినిత్యోదయా!
శ్రీనారాయణ పాదపద్మయుగళీ సేవోత్సుకన్మానసా!
మానాంభోనిధి! సత్కృపాంబుతటినీ! మర్త్యేటిసద్ధాత్రి మణీ! 97

గీ. శ్రీశివారెడ్డిసోదరా! శిష్టగేయ!
బధిరపంగ్వంధయాచక భాగధేయ!
ప్రోజ్జ్వలత్పంచశరతుల్య రూపధేయ!
నమ్రజనబృంద శంకరనామధేయ! 98

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

## ద్వితీయాశ్వాసము.

కం. శ్రీనారాయణరెడ్డి సు
ధీనాయక వరకుమార! ధీరాగ్రసరా!
దీనజనసముద్ధారా!
జ్ఞానపయోరాశ్యగస్త్య! శంకరరెడ్డీ! 1

వ. అవధరింపుము. 2

గీ. గాధిపుత్త్రుండు పన్నిన కపటజాల
మందుఁబడిపోయెనే? రావణాసురుండు
ఏమిచేసెఁ బ్రతిక్రియ? యిగురుఁబోఁడి
సీతకథయేమి? యాశ్రమసీమమందు. 3

గీ. అనుచుఁ బ్రశ్నించు వాల్మీకిమునివరేణ్యుఁ
గాంచి నారదముని చంద్రుఁడంచితగతిఁ
కర్ణపేయంబుగానిక్షు ఖండరసము
నమృతమునధఃకరించు వాక్యములఁబలికె. 4

వ. ఈవృత్తాంతంబెఱుంగకయ దశాస్యుండు 5

గీ. శుకుఁడు సారణుఁడను రాక్షసులనుబిలిచి
మిథిలకుంబోయి జనకభూమీవరేంద్రు
మత్సఖుని సమీపించి నమస్కరించి
సీతనిమ్మనినాకు యాచించిరండు. 6

మ. అనిపంపన్ శుకసారికల్ మిథిలయందా యాప్రదేశంబులం
దున సంచారము సేసి యచ్చటికథం బూర్ణంబుగా సంగ్రహిం
చినివేదించిరి లంకకుంజని సముత్సేకంబుగా నేకతం
బునఁగూర్చుండిన రావణాసురవరున్ భూషించి జేపెట్టుచున్. 7

కం. దేవర! యానతిఁ గైకొని
దేవా! [illegible] మిథిలకేగి తిరిగితిరిగి యా
యావార్త లెఱిఁగికొంటిమి
సేవకులము మేము మనవి చేతుము నీకున్. 8

శా. ఆకన్యామణి దివ్యమంగళగుణంబుండై నట్టి శ్రీరామునిన్
లోకాతీతునిఁ బెండ్లియాడఁదలఁచెన్ రూఢంబుగా నాత్మ; నం
గీకారంబునొసంగెఁ దండ్రియు నీకృత్యం బవిఘ్నంబుగాఁ
జేకూర్పంగను గాధిసూనుఁడు వహించెన్ సర్వభారంబునున్. 9

ఉ. యాగమొనర్పఁ బూనెనఁట! స్వాశ్రమమందున గాధిపట్టి; యా
యాగముఁజూడఁ బోయెనఁట! ప్రార్థన సేయఁగ సీత నూర్మిళం
దాఁగొనిభూపుఁ; డా దశరథక్షితిజాని సదారపుత్త్రుఁడై
రాఁగలఁడంట! యచ్చటికి రాఁగనె పెండిలియంట! సీతకున్. 10

గీ. వారలంగొని తేరనే పారకాంక్షి
వరుఁడయోధ్యకుఁజనెనంట! వత్తురంట!
రేపొ! మాపొ! యిసంతయుఋషిపన్నిశీత
కపట నాటకమందలి గాథసుమ్ము. 11

గీ. అప్రతిమమైన నీమువంశప్రతిష్ఠ
విశ్రుతశ్రీసమృద్ధిని, విశ్వవినుత

విక్రమంబును, సఖ్యంబు, వీనియందు
దేనిఁగూడను జనకభూజానిగనఁడ. 12

గీ. శైవుఁడనుచును బహుకాల సఖుఁడటంచు
నార్జవమునీవు ప్రకటింపనతనియందుఁ
గుటిలభావంబుఁజూపెనాక్షోణివిభుడు
మంచికిని మంచిగలదె? భూమండలమున. 13

గీ. తెలియదే? సీతకై ననీస్థితిసమృద్ధి
తెలియకుండినఁజెప్పంగవలదెతండ్రి?
అలశతానందమునియైన నవనిపతికి
నేల! బోధింపకుండెనో? యెఱుకవడదు. 14

గీ. యజ్ఞవిఘ్నంబు సేయవద్దనుచుగాధి
పట్టి మాహేశ్వరుండైనపరశురాముఁ
బనిచి మునుమున్నె ప్రార్థించికొనుటఁదలఁప
రక్కసులకన్నులందుఁగారంబుఁగొట్టె. 15

గీ. మొదటనుండియుఁ గౌశికమునియెమునకు
ద్రోహముఁదలంచుచున్నట్టి దుండగీఁడు
వానిఁగడతేర్చియున్న నీవఱకెజనకుఁ
డర్పణముసేసియుండుఁ గన్యకనునీకు. 16

గీ. దిగ్విజయమును సాగించి దిక్పతులను
సురలబందీగ్రహముఁగొన్న తరుణమందె
దశరథునిఁజంప రాముఁడుద్భవమెకాఁడ
మెలఁతదప్పక నిన్నె ప్రేమించియుండు. 17

గీ. వాసవుఁడుదొట్టి యెవ్వాని శాసనంబు
స్రజమునుంబోలెఁ దగ శిరసానహింతు
రట్టి నీవర్థి వగుట, నీప్రార్థనంబు
వ్యర్థమగుటయు నెంతటి యపయశంబు. 18

వ. అభిమానధనుండగు ప్రభువున కవమానంబుగల్గుట గత్తిదూయ
కయే శిరశ్ఛేదంబు సేయఁబడుట, జీవకళ యాకర్షింపఁబడుట,
గౌరవసౌధరాజంబు నేలంగూలుట దుర్గంధంబు మేనఁబూయఁ
బడుటయునని పలికిన రాక్షసేంద్రుండు గొండొకవడిఁజింతించి
యుంకించి తలసంకించి శుకసారణులఁబరికించి యేయుపాయం
బున నాకన్యామణి లభియించునన వారుదేవా! కౌశికుండ
యోధ్యకు దశరథాదులఁగొని తేఁబోయెను గనుకఁ దాటకను
దత్పుత్రుండగు మారీచునిఁ బంపి మార్గమధ్యమున వారి
సంహరింపఁజేయవలెను. నీవురామవేషంబును మేము లక్ష్మణ
విశ్వామిత్ర వేషంబులను ధరించి జనకుని సమీపింపవలయును.
తాటకాదులు రామాదుల సంహరింపఁజాలుదురే? యని
శంకింపంబనిలేదు. ఏలన 19

గీ. గజసహస్ర బలంబును గలిగియుంటఁ
దాటకయె వారి హింసింపఁదగిన; దాపె
చాటుగానున్న నిశిచిన సమ్ముఖమునఁ
జాసయనుచును పేక్షింతుర చంపనుండ. 20

చ. ఒకపరిఁ జిమ్మచీఁకటుల నొండొకసారి యదభ్రవారిద
ప్రకరము, నొక్కసారి నితరాం విషపూరిత ధూమరాశి, వే

ఉల్కాపరిధూళివృష్టిని మహోద్ధతిఁ గల్పన సేయుచుం మరు
న్నికరముఁ దాటకాసుతుఁడనిన్ బహుభంగుల నేడిపింపఁడే!

గీ॥ కానఁ బంపుము వారి నీక్షణమునందె
యాయయోధ్యాపురీ మార్గమందుఁ గనుఁగ
మనము నాయాయి వేషంబులను ధరించి
చనుద మిఁక లెమ్ము కౌశికాశ్రమమునకును.

గీ. రామవేషంబుఁ దాలిచి రాక్షసేంద్ర!
జానకినిఁ బెండ్లియాడుము; జనకనృపతి
పిదప సత్యంబెఱింగియు ముదమొదవును
సతియు నీవైభవముఁ గాంచి కుతుకపడును.

కం. అని పలుకు వారిమాటలు
విని రాక్షసరాజమౌళి విస్రబ్ధముగా
ననుకూలపడును నిఁకమన
పని యీగతి నడవ ననుచు భావించె దగన్.

గీ. నాదు కనులిర్వదియును నెన్నండు జనక
జాతనీక్షింతుమో? యని సంభ్రమించు
నాదు చేతులునట్లె యేనాఁడు తరుణిఁ
గౌఁగిలింగొందుమో! యని వేగిరించు

గీ. దశరథాత్మజుఁ బ్రేమించెఁ దరుణి యన్న
నుడి నెఱుంకులకుందాఁకి నొంచునొకట
ఆవధూమణి లావణ్యమాలకింప
మరుఁడు గుప్పించు విషదిగ్ధశరములొకట.

గీ. వేల్పుటాంబ్రతును గనుఁగొన వేడుకపడు
నాదురూపంబు మెచ్చ దానాఁటియకట!
సిగ్గు నెగ్గునుదిగఁద్రావి చెలువకొఱకు
నరపశువురూపమునుదాల్ప నాకువశమె? 27

ఉ. తన్ను వరింపనట్టి వనితామణిఁగోరుట యొక్కతప్పు; త
ప్పున్న ఱహంత్రియుండయిన పూరుషురూపముఁదాల్చికొంటయుం;
దిన్ననిశైవభక్తిని విదేహధరాధిపు మోసపుచ్చినం
బన్నగ కెంపుతప్పులగు భాగ్యముగాదిది నాకుఁజూడఁగన్. 28

వ. అని బహువిధంబులను వ్యగ్నుఁడయియున్న రాక్షసాధ్యక్షుం
గనుంగొని శుకసారణులు 29

చ. "మనకులవిద్యయై తగునుమాయ;" గురుండుపదేశకాలమం
దనఁ "బరభామలంగొనుము; పొంగిలుఁడన్యులసొత్తు స్వేచ్ఛ; ధ్వం
సన మొనరింపుఁడీ నరనసంతతి;" యంచును చెప్పియుండఁడే?
మనమునఁబట్టి మాగురునిమాటలు దాఁటినఁబాపమయ్యెడిన్. 30

గీ. సీతఁదేకున్న రాక్షస జాతికున్న
మానముఁగంటుఁ; గీర్తిపూసిపోవు;
ననుచు వేడినిఁబుట్టింప నంతఁదాట
కాదిరాక్షసులను బిల్వనంపెరాజు; 31

శా. పెగ్గుల్ హాసముల్ల్స చన్నులపయిన్ ఫ్రేలాడఁ, బెందాఁకులన్
మేగంబుల్ శకలంబులైపడినవిన్ స్పృష్టమాంసంబుఁగై
కోఁగామూఁగిన గద్దపిండుగములుం గోరాడఁ గేశంబులున్
వేగందాటక యట్టహాసముదగన్ విచ్చేసె మారీచుతోన్. 32

గీ. వచ్చి పెనుభక్తితో నభివాదనంబు
సలుపరాజును గర్తవ్యసంగ్రహంబుఁ
దెలుప "నింతేల! హరియించి తెత్తు సీత
వ్రేల్మిడి" నటంచు నాపెయుఁబెద్దఁబలికె. 33

గీ. "వలదు, వలదు, బలాత్కారపఱప నన్నుఁ
బడఁతి ప్రేమింపఁబోదు; పూర్వమున నిట్లె
రంభను బలాత్కరింప నారమణికినిసి
శాపమిచ్చె ననిష్టంబు జరుగునట్లు. 34

వ. కావున మాయోపాయంబున రామాదుల సంహరించితి రేని సీత నాకుఁదక్కును. మీకు సాహాయ్యార్థముగా సుబాహు కరాళులనుగూడఁ గొనిపొండు." అని పలుకఁ దాటకా మారీచులు చిత్తమని సభక్తిప్రణామంబులు సేసి నిర్విఘ్నకార్యసమాప్తి ఫలకంబులగు నాశీర్వాదంబులు వడసి వీడుకొనివచ్చిరి. రావణుండును శుకసారణులఁ బ్రయాణసన్నద్ధులరగుఁడని ప్రేరేపించి తానును సన్నద్ధుండయ్యె. 35

గీ. దైవబలముగలట్టి సత్త్వములయందుఁ
గుంటువాఱు మాయాబలంబంటయెఱుఁగ
రజ్ఞ; లీఁకనాత్మవిశ్వాసమజ్ఞవిజ్ఞు
లకు సమానంబె; యగువిజ్ఞులకు జయంబు. 36

వ. అట్లు రావణుండు సన్నద్ధుండై విమానంబుఁ దేర సేవకులఁబంపి 37

గీ. తాటకాదులు నాయాజ్ఞ దాఁటకుండ
నుక్తకార్యంబనుష్ఠించియున్న నేను

రామవేషంబుఁదాల్చిన రమణినాకు
దక్కునో? దక్కదో? మదితల్లడిల్లు 38

వ. అని దిగులువడి నిలిచియుండ 39

మ. ధనువుఀ హస్తమునందు, వెన్కశరధిస్కంధంబు, వక్షస్స్థలం
బున స్వల్పంబగు భస్మరేఖఁ, గటినిఀ ముంజిం బ్రతిష్ఠించి మో
మునలక్ష్మీకళతాండవింప నయనంబుల్ కర్ణముల్ తాఁక నా
తనపుంబ్రాయమునాఁగుమీసములుతేద్దందెల్పు
చుండఁదగ౯ 40

గీ. నిన్నుఁగనిరాముఁడేయని నిశ్చయించి
చేతిముత్యాల దండనుసీత నీదు
కంఠమున వేయఁగలదు నిక్కముగనమ్ము
మేల! తల్లడపాటువహింతునయ్య! 41

మ. రతినిందన్నినయందకత్తెయగునా రామాశిరోరత్నము
ద్గతమౌ ప్రేమమహాప్రవాహమున ముక్తాదామకంబుం గటా
క్షతతిఀ నీవయివేయ దగ్గఱకు రాఁగాఁజూచిరాజా! కృతా
ర్థతనొందింపుము నీదునేత్రయుగముఀ ధన్యత్వముం
బొందుమా! 42

కం. అనివానిఁబ్రోత్సహించుచు
మనోగతంబగు స్మరాగ్నిమండింపఁగ నిం
ధనములు వేయుచు శుకసా
రణులుండగఁదనవిమానరాజమువచ్చె౯. 43

గీ. తనదు దిగ్విజయైకచిహ్నాన; మనేక
రత్నమంగళ దీపికారాజితంబు

తరుణమేఘావ గుంఠితంబరుగుదేరఁ
బుష్పకవిమాన మెక్కి రాముప్పారపుడు. 44

గీ. తారకామండలంబు క్రిందటికి డిగ్గు
చున్నరీతిగ, క్షితిక్రుంగుచున్నయట్లు
మించినేత్రోత్సవంబు సంధించుచుండె
నావిమానంబునెగసిపైకరుగుచుండ. 45

ఉ. ఎదురయి కేలుమోడ్చునమరేంద్రునిఁజూచ్కి ననుగ్రహించుచున్
అదరునఁబాఱునచ్చరలనాడఁగఁజేయుచుఁ, బాదుసిద్ధులన్
వదలక యాత్మకీర్తి మృదుపక్కినిఁ బాడఁగఁజేసివించు స
మ్మదమునరాక్షసేంద్రుఁడువిమానముపైఁజనుచుండెమింటిపై. 46

గీ. వార్ధిచేష్టలుడిగి జడపార్ధియమయ్యె
భాస్కరుండయ్యె రత్నదర్పణమురీతి
వాయుదేవుండు దెసలకుఁ బాఱిపోయె
బయలుదేర విమానంబుపయినతండు. 47

గీ. ఒక్కయెగుడుననే యామహోజ్జ్వలమగు
పుష్పకవిమానమెంతయో పొడవుదాఁటి
జనకజాపాద సంచారఘనతఁగొన్న
కౌశికాశ్రమసీమ దగ్గఱకువచ్చె. 48

సీ. చెక్కించి చక్కఁగా సిద్ధంబుగాఁజేయఁ
గాఁబడినట్లున్న కందరములు
ప్రతిదినంబును నీరుపట్టి లెస్సగఁబెంపఁ
బడుచున్న గతిఁబొల్చుపండ్లచెట్లు

ఇచ్ఛవచ్చినరీతి ఋషివరుల్ త్రిప్పిరో
న్నట్లుగాఁ బ్రవహించునట్టి యేళ్లు
కల్పించి యొక్కనికై యేర్పఱచినట్లు
పొదలుచుండెడు పువ్వుఁబొదరుటిండ్లు

గీ. తారతమ్యంబువదలి తద్దయునమర్పఁ
బడినగతినున్న పాషాణపటలిగిరిగి
శిల్పినైపుణిఁ జూపరచించినట్లు
ప్రమదమొసఁగు నాయాశ్రమప్రాంతభూమి. 49

సీ. భక్తియుక్తంబుగాఁ బాద్యంబునర్పించు
నెల్లప్పుడా సెల యేళ్లజాళ్లు
హృదయపూర్వకముగా నిచ్చునర్ఘ్యంబును
దినదినంబా పూవుఁదీవగములు
ఆప్యాయనమ్ముగా నాహారమర్పించుఁ
జేతికి నాసండ్ల చెట్లగుంపు
లార్ద్రచిత్తంబుతో నడుగు సేమంబును
గలకలకూయు నాపులుగుప్పండు

గీ. వన్నిటికినేమిగాని తానచట వెలసి
యుండునానందదేవి మహోత్సవమునఁ
జెలఁగియమృతవాక్యములనాశీర్వదించు
నేగుదెంచెడు నతిథుల బృందములను. 50

చ. వలచను మాటలేదెవరు వచ్చిన, నెన్నిదినంబులున్ననోఁ
బలికెడువారులేరొకరివస్తువులివ్వనుమాటలేదు ; తీ

వెలగమితోడ స్నేహలతఁబెంచుచునుందురు బాపు! చెప్పగా
వలసినదేమి? మానవుని భాగ్యముగా! యట కేగిచూచుటల్ 51

గీ. ఎపుడు సెలయేటి యొడ్డుల నెగుడుదిగుడు
రాతిబండలఁగూర్చుండి రాత్రిపడెడు
దాఁకనానందమధుర గీతములుబాడు
చుంద్రు ఋషికుమారికలుమహోత్సవమున. 52

సీ. ఉన్నతికింబోవుచున్న గొబ్బండల
చెట్టుల నరసి వీక్షించుచున్నఁ
బండులబరువుచేనిండి నేలకువంగు
కొమ్మలుగలవృక్షకోటిఁగన్నఁ
బరులకోసంబె జీవనములఁదాల్చుచు
ననయంబుఁబాఱువాహినులఁగన్న
గంటకాదులు దమ్ముఁగాడిన నిశ్చల
త్వమునుమాననిశిలాతతులఁగన్నఁ

గీ. మానవుని చిత్తమందు నేమాత్రమైన
జ్ఞానముండిన యెడలనిశ్చయముగాను
సడలిపోదె? తనంతదోషప్రవృత్తి
పరులు బోధింపనక్కఱపట్టకుండ. 53

సీ. తాపసేంద్రులకు నిత్యమును శుశ్రూషింపఁ
గవసంతలక్ష్మి జాగ్రత్తనుండు
మునిపుత్త్రికలుగాత్రములనెత్తిపాడఁబోఁ
గోయిలగమిశ్రుతివేయుచుండు

బ్రహ్మచారుల వేదపాఠంబులోఁగీర
బృందంబులు గవళ్లు దిద్దుచుండు
సామగానమునకు శైలంబు హృదయంబు
గరఁగినిర్ఝరములై పఱచుచుండు

గీ. అకృతకమనోహరంబులౌ నాకుటీర
కంబులానందరాజ్య శృంగాటకములు
ఋషిజనైక తపోధన క్రీతమయిన
యాపరిపంచంబు స్వర్గమర్త్యములసంధి. 54

గీ. తీరుతీరైనచల్వపందిళ్లు వేసి
రీతిరీతిపూఁదోరణుల్ వ్రేలఁగట్టి
వలయుసర్వసన్నాహంబు సలుపఁబడెను
నచటనానంద లక్ష్మికల్యాణమునకు. 55

గీ. ఒక్కవృక్షంబునకుఁబూచియున్నపువ్వు
లొక్కచేనిలోఁపలఁబండి యున్నపంట
ఒక్కగనియందు జనియించియున్నమణులు
ఈప్రదేశానఁ జరియించునెల్లమంది. 56

గీ. అట్టి కౌశికమునిచంద్రు నాశ్రమంబుఁ
దఱిసితమవిమానంబుఁ దత్ప్రాంతమందు
నిలిపి యచ్చటి వృత్తాంతములనెఱుంగఁ
గాఁదిరస్కరిణీ విద్యఁగడఁగిపూని. 57

వ. సంచరించుచు నాశ్రమశోభనీక్షించుచుండిరి. ఇట్లుండ నక్కడఁ
గౌశికుం డయోధ్యకుంబోవుచు జానకకుమారికి సహాయార్థం

బుగా గుణవతీ శీలవతులను నిద్దఱుమునికుమారికల నిచ్చెను.
సీతయువారితోఁ బ్రొద్దులుపుచ్చుచుండెను. 58

గీ. విరహపరవశయగు నొక్క వెలఁదిమిన్న
చిగురుటాకుల సెజ్జపైఁ జేర్చి మేను
ఉలికిపడిలేచి చూచుచునొక్కతూరి
కలఁతబాఱినడెందంబు గలిగియుండి. 59

గీ. "చిత్రలేఖన సామగ్రి శీలవతియు
నల్లశిశిరోపచార పదార్థచయము
గుణవతియుఁ దేరఁబోయిరి గుట్టెఱింగి
విజనమని నన్ను మదనుండు వేచుచుండె. 60

గీ. ఓయి! భగవానుఁడా! క్షణంబోర్చుకొనుము
పంచశర! యొక్కపరియైనవార్సి ప్రియునిఁ
గన్నులారంగఁగాంచి తత్క్షణము విడుతు
నీకొఱకు నాదుప్రాణముల్ నిక్కవముగ. 61

కం. గరళమొ? ప్రియదర్శనమో?
శరణంబిఁక నాకు" ననుచు సతివిలపించుం
బొరలును జిందఱవందఱ
పఱచును శయనంబుఁ దొట్రుపాటునుఁ జెందున్. 62

గీ. చిగురుటాకులు మేయుచు జీరలేక
హాయిగాఁ బాడుకోకిలావ్యాహృతంబొ?
పువ్వు విల్కాని త్రైలోక్యములజయంబు
పరిఢవించు భోగావళీపాఠమొక్కొ? 63

చ. తెఱచిన మూసినట్లుగనె దృక్కులకుంగనిపింపకుండె నీ
గరితయెవర్తయో? యెవనికై తపియించుచునుండెనో? కడున్
విరహముఁబొందుచున్నటుల వీరలచేఁతలు సెప్పుచుండె నా
తరుణుఁడు ధన్యుఁడైనను నుదాసుఁడుగాననధన్యుడేయగున్ 70

వ. ఆతరుణుండెవ్వఁడు? ఈతరుణియెవ్వతె? యని యాతురపడు
చుండ. 71

గీ. స్వప్నములయందుఁ దనకు సాక్షాత్కరించి
స్వాంతమునయందుఁ జక్కఁగాఁ బ్రతిఫలించి
యున్నమోహనమూర్తిని యువతివ్రాయ
ఫలకమును గుంచెయును జేతఁబట్టికడఁగి. 72

మ. ధనువున్ హస్తమునందు, వెన్కశరధిద్వంద్వంబు. వక్షస్థలం
బున స్వల్పంబగు భస్మరేఖఁగటినిన్ ముంజిం, బ్రతిష్ఠించి మో
మున లక్ష్మీకళతాండవింప నయనంబుల్ కర్ణముల్ తాఁక నూ
తనపుంబ్రాయమునూఁగుమీసములుదద్దందెల్పువచ్చెన్. 73

గీ. కువలయ శ్యామలాంగుని క్షోణిపాల
నోచితపదాబ్జ భవ్యచిహ్నుని మహాత్ము
క్షాత్రధర్మస్మృతులకు నాచార్యవరుని
లలితమూర్తిని వ్రాసి యంజలిఘటించి. 74

చ. "కురియుచునుండెనాపయినిఁ గ్రూరమతిన్ మలయానిలుండు దు
ర్భరముగ విస్ఫులింగనికరంబులు గుమ్మరియావమట్లు చం
దురుఁడును మాడ్చుచుండె మదనుండదయుండగుచుంగఠోరపున్
శరములుగుప్పుచుండెననునాథ! యుపేక్షయొనర్పఁ బాడియే? 75

గీ. మరియుమానద! యనియాఁగికఱచికొనుచు
నాలుకను, జిత్రగతుఁడైన నాథుఁగాంచి
పారమార్థిక బుద్ధితోఁ బలుకుచుంటి
ననుకొనుచు సిగ్గుపడుచుఁ గొంగునను గప్పె. 76

వ. అపుడు నిశాచరవల్లభుండును శుకసారణులును జిత్రగతపురుషు
నింగాంచి 77

గీ. వైరులకునైన నేత్రోత్సవంబు సేయు
చక్కనిశరీరకాంతియు సాధువినుత
మగుస్వభావంబునుం దెల్పు నతనిదగున
నన్యసామాన్యమైన మహత్త్వభూతి. 78

వ. ఈమహాపురుషుం డెవండై యుండునో? యని విచారించుచుండ
గుణవతి ప్రేయసీ! నీచిత్రలేఖనానైపుణ్యంబు బరికించిన నీప్రి
యుండు నీహస్తంబుల రత్నకటకంబులు దొడుగును సుమా!
యని మేలమాడ శీలవతి గుణవతీ! నాయనగారైన విశ్వా
మిత్త్రులవారు జానకీ రక్షణార్థంబు రాక్షసాంధంకరణమణీఘటి
తంబులగు కంకణంబులర్పింపుమని నీచేతికియ్య నీవును నీపెకర
కౌశలంబుత్ప్రేక్షించియోయను నట్లీపెకుఁ దొడిగితివి గదా!
యని చిఱునవ్వునఁ బలుక 79

శా. ఈమాటల్ విని సారణుండనుఁ బ్రభూ! యీతండె యారాముఁ డీ
రామారత్నమె సీత నీవు కనుమాత్రక్ దీనిఁగైకొందు వం
చావహ్నీంద్రుఁడు రక్కసుల్ కననదృశ్యాత్వంబు సిద్ధించు న
ట్లామోదంబుగ రత్నకంకణయుగంబర్పించె హస్తంబులక్. 80

గీ. అనిన నేమేమి? యారామహతుకుఁడా? యి
తండు? నా ప్రేమకోశంపు ధామమునకుఁ
గన్నముం ద్రవ్వి హరియింపఁగాఁ దలంచు
చోరుఁడా? యంచుఁ గేకసీ సూనుఁడలిగి. 81

వ. ఆచిత్రగత రాముమ్దేశించి 82

చ. గరువమునొందఁబోకు వృధగా జనక క్షితిపాలనందనీ
పరిణయ భాగ్యవైభవము పట్టుమనాకని యోయిధూర్త! యీ
వఱకెనినుక్ పధింపఁగను బంపితి సుమ్మలతాటకాసుతుం
బరిణయభాగ్యవైభవముపట్టును లెమ్మిఁక మృత్యుకన్యకాలోక్. 83

కం. అని మొగము నెత్తి యాకస
మునదృష్టినిగుడ్చి చూచి బొమముడి గ్రాలం
గనలుచును క్షత్రియబ్రా
హ్మణా! దురాత్ముండ! కౌశికాపసదుండా! 84

మ. దివిసృష్టింతువుగాక మూర్ఖనుడు వే? తేజస్విమారీచు; ని
త్తువు శాపంబును రంభకుక్ గెలుతువే? దుర్ధర్షయాతాటకక్
బవరంబందుఁ ద్రిశంకుభూపతినిఁ గావంజాలుదానీవు రా
ఘవు రక్షింతువె? నాకు విప్రియము సంకల్పించి జీవింతువే? 85

వ. అని కనలుచు నోయీ! సారణా! జానకిని దర్శించునుపాయంబుఁ జింతింపుమన నాతండును దేవా! చింతించియేయుంటిని. నేనా యోధ్యక బ్రాహ్మణ సన్న్యాసి వేషము ధరించి జానకిని సమీపించి యాపెకుఁ బ్రియంబుసెప్పి బహుమానంబుగా నాకంకణంబులు గొనివత్తు. అంత నాపె గోచరించును. అని చెప్ప

నారక్షోనాథుండు వాని యుపాయంబునకు సంతసించె. అంత
కొంతసేపటికి నాముువ్వురు కన్యల వద్దకు 86

సీ. పండఁబారిన నాచుపింపుఁ గేరెడు జటా
జూటంబుఁదీపియఁ జుట్టపెట్టి
సుడిగొన్న నల్లతాఁచుల మలంకలుఁబోని
మాలలు కంఠసీమమునదాల్చి
కరువుబోసిన పడికంపు విగ్రహమునాఁ
దెల్లనిబూది మేనెల్లబూసి
భరితరాగస్ఫూర్తి ఫాలనేత్రమునాఁగ
బొమలందుఁ గుంకుమ బొట్టుపెట్టి

గీ. పులికళాసంబు కట్టగా మొలకుఁజుట్టి
చేతనొక్క భిక్షాపాత్ర సేకరించి
సత్త్వమూర్తి తేజోరాశి శంకరుండు
నాఁగనేతెంచె దివ్యసన్న్యాసి యొకఁడు. 87

గీ. దగ్గఱించిన యతిని నత్యంతభక్తి
నర్ఘ్యపాద్యంబులను బూజనాదరించి
వితతసాష్టాంగ దండప్రణతులు సేసి
వారుకింకరులయి నిల్వఁబడియునెదుట. 88

వ. స్వామీ! తామెచ్చటనుండి విజయం చేయుచుంటిరి. మీ
చరిత్రంబు శిష్యురాండ్రమగు మాతోఁజెప్పవచ్చునేని వినఁ
గోరెదము. అనిన 89

గీ. కన్యకామణులార! నాకాపురం బ
యోధ్య పూర్వాశ్రమమునందు; నుత్తముఁడగు

రామచంద్రుని మిత్త్రిండ; బ్రాహ్మణుండ
నరుగుదెంచితి నాతని ప్రార్థనమున. 90

గీ. కౌశికాకృతిఁగొన్న యఖండమైన
నీదుపుణ్యంబుగొనిరాఁగ నీప్రియుండు
స్మరుఁడునాఁదగు శ్రీరామచంద్రమూర్తి
యరుగుదెంచును నేఁడింక హర్షపడుము. 91

మ. అని సన్న్యాసివచించు భాషణముఁ దానాలించెనో? లేదో? య
వ్వనితారత్నము పారవశ్యమునఁ దత్పాణిద్వయంబందు ర
క్షణకై గాధిసుతుండు మున్నిడిన రక్షోంధకరిష్ణూజ్జ్వల
న్మణిబద్ధంబగు కంకణాలు బహుమానంబిచ్చెన మ్మౌనికిన్. 92

గీ. విరహమునఁ గ్రాగిమ్రగ్గి తపించుచున్న
యంగనలకును సంజీవనౌషధంబు
ప్రియునికథలందునుంగూడఁ బ్రియునిరాక
బలముగలిగించు నౌషధంబిలఁదలంప. 93

వ. అట్లు జానకి కంకణంబులు మునికీయఁగానే రావణుండు విస్మయ
పడుచు 94

చ. పఱపుచునుండెనే? యిపుడు వారిదసంచయ నిర్వ్యపేక్షమై
మెఱుఁగులు కుంకుమ ప్రభలమేయముగా, నటుగాక యున్న నం
బరమును భూమియున్ దెసలమాంతముగాఁ గరగించినట్టి బం
గరువునఁ బూఁతఁబూసిన ప్రకారముగాఁ గనిపించుచుండునే? 95

గీ. మూఁతవడుకన్నులను యత్నపూర్వకముగఁ
దెఱచి యిదియేమిటా? యని వెఱఁగుపడుచుఁ

గాంచి మెఱుఁగుల చేతనిర్మించినట్టి
యద్భుతంబగు లలన ప్రత్యక్షమయ్యె 96

వ. ఇట్లుతాను కనులుమిఱుమిట్లు గొలుపుటం జక్కఁగాఁజూడఁ జాలకి యుండ నొకదాసి కన్యలయొద్దకువచ్చి "యమ్మా! అత్రి మహాముని యనసూయా సహితుండై కౌశికమహర్షి యజ్ఞ దర్శనార్థంబు విజయంచేసినాఁడు. వారికిఁ బాదాభివందనం బాచరింప నాయనగారు మిమ్ములఁ బిలుచుచున్నా"రనఁగానే శీలవతి "సఖీ! నీకు నుత్తరోత్తర శుభములు గలుగుచున్నవి. పురాణ పురంధ్రియగు ననసూయను దర్శించి యాపెయనర్ఘ్యాశీర్వా దంబులు గైకొందువుగదమన నాపెయు సంతసించి తాను వ్రాసిన చిత్రపటంబునుగూడమఱచి సంభ్రమంబున ముందు నడన గుణవతీ శీలవతులును వెడలిరి. మునియుఁ గంకణంబులు గ్రహిం 97

గీ. రత్నకంకణముల నాకరంబునందుఁ
బట్టనామెనునాకె కన్పట్టకుండెఁ
దాపసుల మహిమంబులత్యద్భుతములు
నందునను గాధిసుతుప్రజ్ఞ యధికతరము. 98

గీ. బంధుసందర్శనోత్సాహ పరవశయయి
తన వినోదార్థము వ్రాసికొనినయట్టి
చిత్రపటమును బాలామా సీతమఱచె
నెంత యనుతాప మొందునో? స్మృతినిబొంది. 99

వ. అని యాచిత్రపటంబును గంకణంబులును దెచ్చి రాక్షసేంద్రునకు నమస్కరించి దేవా! యిదయే చిత్తరువు. ఇవియే కంకణ

ములు. ఇపుడాపెను బాగుగా విలోకించియుందువని నమ్మె
దను. అన నిశాచరేంద్రుండు. 100

చ. మొగమును జూడలేదు; బలుపుంగొనియున్న కుచద్వయంబునా
కగపడలేదు; యామణిమయంబగు మేఖలమాటెలేదు; సొం
పగు వలరాజు ఖడ్గలతయట్లుకనంబడె వేణిమాత్ర చె
న్నుగఁ బరికింపఁగా నకట! నోచగనైతినిఁదక్కనెమ్మెయిన్. 101

ఉ. ఆనృపకన్యకామణి కరాబ్జముపట్టునదృష్టమబ్బిన,
గ్గాననుగండ్లనెత్తియయినన్ సురమానవతీలలామ లం
దేని నొకర్తె; నీపె లభియింపకయుండిననింక సర్వ రా
జ్యానను గూడనాకు ముదమబ్బదు; చీఁకటియేజగంబునన్. 102

కం. ఛీ! యాకటకద్వంద్వం
బీయువతీమణినిఁ జూడనీయక దాఁచెన్
ఛీ! యీచిత్రపటం బిం
దీయువతి మనోహరుండె యొసకంబెసఁగన్. 103

వ. అని వానిని గర్హించుచు 104

గీ. పరమసఖునేని వంచనపఱపవలయు
హేయమైనట్టి రూపు గ్రహింపవలయు
ననుభవింపంగవలయునా యంగనామ
తల్లి మహితపాణిగ్రహోత్సవసుఖంబు. 105

వ. అని పనివడినపుడుపయోగింతమీచిత్రఫలకంబును గంకణంబు
లను జాగ్రత్తపఱపుమన నాతండును జిత్తంబని తనయొద్ద నుంచు
కొని తమధరింపవలసిన రూపంబులుధరించి జనకునొద్దకుఁ బోవుద
మని బయలు దేరిరి. 106

శా. కవ్యాశీర్వచసప్రసాదిత రమాకాంతాకటాక్షోదయా!
నవ్యాసవ్యసుకావ్యనాటక పురాణగ్రంథపాఠాదరా!
భవ్యబ్రాహ్మణభక్తిపూర్ణహృదయ త్వత్ప్రాప్తజనోన్నతీ!
దివ్యజ్ఞానగభీరవామృతనిధీ! ద్విడ్వంశకృన్నైశ్వానరా! 107

కం. శ్రీరామలింగరెడ్డి ప
దారాధనతత్పరాత్మ! ధర్మాధర్మా
చార విచారా! వినయా
ధారా! శ్రీరామిరెడ్డి ధరణీధవసఖా! 108

---

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

## తృతీయాశ్వాసము.

కం. శ్రీనాగమదేవీసుత!
మానితబత్తులకులీన! మంగళమూర్తీ!
భూనుతవైభవ! బహువి
శ్రాణనతర్పితకవీంద్ర! శంకరరెడ్డీ! 1

వ. అవధరింపుము. 2

గీ. రావణుఁడుమున్నుపంపిన రక్కసి గమి
రామునింజంపెనే? మునిరాజు కౌశి
కుండు వారలకెదురెత్తుఁ గూర్పలేదె?
వారి కథనెల్లఁదెలుపుమో పారకాంక్షి! 3

కం. అని ప్రశ్నించెడు వాల్మీ
కినిఁగని కరుణార్ద్రదృష్టి కెరలుకొనంగాఁ
గనులకుఁ గట్టినయట్టులు
వినిచెఁ నారద మహర్షి విపులముగఁగథన్. 4

గీ. సృష్టికింబ్రతిసృష్టి నేసినఘనుండు
కౌశికుఁడురాఁగ దశరథక్ష్మావరుండు
వినయమును భక్తియును శ్రద్ధయునుఁబెనంచి
త్రాడుగాఁగట్టి దేహమాతనికొసంగి. 5

చ. ప్రతినిధి బ్రహ్మకుఁ; గృహము రాజసభూతికి; వహ్నియుంబవి
త్రతకును; జాపవిద్యకధి దైవము; హద్భుతపఃప్రభావ సం
గతులకు; ధర్మదేవతకు గాదిలిపుత్త్రుఁడు; మంత్రమూర్తి; య
ప్రతిముఁడు గాధిపట్టియని ప్రస్తుతిసేయును నిన్నులోకముల్. 6

గీ. పూర్వమార్జించుకొన్నట్టి పుణ్యరాశి
ద్వారముసఁగల్గు భవదీయదర్శనంబు
పాపమునురాల్చునిపు! డిచ్చు భావిశుభముఁ
బ్రాణికతికిఁ ద్రికాలయోగ్యత ఘటించు. 7

గీ. భద్రదశకుఁ బ్రారంభోత్సవంబుమీదు
దర్శన, మనుగ్రహము పదస్పర్శనంబు
పరమ మంత్రోపదేశముల్ భాషణములు
సాధుచారిత్ర! సన్మిత్ర! గాధిపుత్ర! 8

కం. ప్రతికూలంబగునట్టి భ
వితవ్యమనుకూలపఱచుఁ బ్రియభవదాశీ
స్తతి; యిది విరించి సృష్టికిఁ
బ్రతిసృష్టినొనర్పఁగలుగువానికి లెక్కా? 9

గీ. అనుచు నానందబాష్పాంబువునమునీంద్రు
చరణపంకజములను బ్రక్షాళనంబు
సలిపికోటీరమణి పుష్పసంచయమునఁ
బూజఁగావించి నమ్రుఁడై పొంతనిలిచె. 10

చ. నిలఁబడియున్న పంక్తిరథునిం గరుణామృత నిమ్నగా పరీణా
ఖలగు కటాక్షవీక్షల వెలుంగులమొత్తముఁ బాఱఁజేయుచుం

జెలువుగమంత్రపూర్ జలముఁ జిమ్మనగ్రోవులఁ జల్లుచుట్టుగన్
బలికెను గాధిపుత్త్రకుఁడనామయమే? గదయెల్ల వారికిన్. 11

గీ. నేను జన్నంబు సేయంగ నిశ్చయించి
పిలువఁగావచ్చినాఁడ భూభృద్వరేణ్య?
ఆలుబిడ్డలతోడ మాయాశ్రమంబు
నకును విచ్చేసి నన్నునానందపఱుపు. 12

వ. అనిన దశరథక్ష్మాజానియు 13

గీ. పిలువకయె యజ్ఞమునకుఁ బోవలయుననుచు
ధర్మశాస్త్రంబు ఘోషించుఁదద్ద; శిష్య
బృందమును బంపకయు మీరెయేగుదెంచు
టద్దిమాపయిని ననుగ్రహంబుగాదె? 14

వ. అని వెంటనే ప్రయాణ సన్నాహంబు సేసి ముగ్గురు భార్యలను బుత్త్రులగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులను శ్రీరాముని మిత్త్రులగు పింగళకాశ్యపులను దగినసైన్యంబును దీసికొని యజ్ఞదక్షిణార్థంబువలయు ధనంబులు గైకొని వెడలెను. 15

గీ. ధర్మముఁబురస్కరించు పవిత్రాపరాశి
యట్టులెల్లరు వెంటరా నామునీంద్రుఁ
డాశ్రమమునకుఁబోవుచు నధ్వమధ్య
మందు నొక్కసాంద్రారణ్యమందువిడియ. 16

చ. సెలవులరక్తమాంసములు జీరలుగట్టఁగ నాల్కసాఁగఁ బ్రే
వులగమిగ్రువ్వఁగాబడిన పుర్కలదండలు వ్రేలుచుండఁ జ

న్నులపయి, నీఁతరుప్పవలెనుఁ బిఱుసైకఱకైన వెంట్రుకల్
తలఁదగ భీకరాకృతినిఁదాలిచి తాటకవచ్చెనత్తఱిన్. 17

గీ. అటకె మాయాంబుధులు తాటకాత్మజుండు
నాసుబాహుకరాక్షులు నరుగుదెంచి
పట్టుపట్టుఁడు రాముని గొట్టుకొట్టుఁ
డనుచు నలుగురు నలుపక్కిలాక్రమించి. 18

సీ. ప్రాంతపర్వతసానుభాగంబులందున్న
పెనుబండలను దెచ్చి విసరుచొకట
ఝంఝానిలంబు విస్తారంబుఁగల్పించి
వాత్యాభ్రముల బాధపఱచుచొకట
సూచికాభేద్యంపుఁ జొప్పు చీఁకటిఁగొల్పి
చక్షురింద్రియశక్తిఁ జంపుచొకట
కనకనలాడుచుండిన పెద్దనిప్పుల
జడివాన గురియఁగాఁ గడఁగుచొకట

గీ. దుమ్ముత్రూత్పెత్తుచొక్కట; త్రోవదెన్ను
గానరాకుండనిట్లు చీకాకుపఱచు
చచటఁ బొదలందు గుట్టలయందుఁ జేరి
తమ స్వరూపంబుఁజూపక దాఁగియుండ. 19

వ. విశ్వామిత్రుండీవి తాటకాదిరాక్షసుల దుండగంబులని యెఱింగి
తన తపోమహిమంబుచే దశరథాదులకు బాధలు గలుగకుండఁ
జేసి రామునింగని రామచంద్ర! 20

చ. సెలవుల రక్తమాంసములు జీరలుగట్టఁగనాల్కసాఁగఁ బ్రే
వుల [illegible] [illegible]లదంష్ట్రలు వ్రేలుచుండఁ జ

న్నులపయి సీఁతఁఋప్పవలెనుఁ బిఱుసై కఱుకైన వెంట్రుకల్
తలఁదగ భీకరాకృతినిఁ దాలిచియున్నది చూడు తాటకన్. 21

గీ. మేగములపిండు చాటున డాఁగియుండి
హోమకుండంబులను యజ్ఞభూములందు
రక్తమాంసాది దుష్పదార్థములఁగురియు
నిది గజసహస్రబలమువహించియుండు. 22

వ. మరియు. 23

శా. త్రేతాగారమునందుఁజొచ్చి యట ఋత్విగ్బృందముంజంపు; దు
ర్నీతింగైకొను హవ్యముల్; పగులుచున్ స్రుగ్భాండముల్; తత్పశు
వ్రాతంబుందిను; భ్రూకుటీవికటుఁడై ప్రౌఢిన్ ఋషిస్త్రీలకున్
భీతింగొల్పు నలంఘ్యశాసనుఁడనం బెంపొందు చెల్లన్సుబాహున్. 24

గీ. పెక్కురంగులనూసర వెల్లియట్లు
పెక్కురూపంబుల ధరించి బెడఁదసేయుఁ
దాటకాపుత్త్రుఁడాతండు తదనుయాయు
లాసుబాహుకరాళుల నరసికనుము. 25

గీ. బ్రతికియుండంగనేవీరిఁ బాఁతిపెట్టఁ
గాల్చినంగూడఁ బాపంబుగలుగబోదు
మంచిసుముహూర్తమిద్ది స్తంభప్రతిష్ఠ
సలుపుమా! శౌర్యలక్ష్మి ప్రాసాదమునకు 26

ఉ. ఆఁడుదియన్న సంశయము నందక ముందుగ సంహరింపుమీ
తాడకనీవు బ్రాహ్మణహితంబుగ; నొక్క మహాకులంబుఁగా
పాడఁగఁబుత్త్రినైనవిడువన్ వలెనంచును ధర్మశాస్త్ర మం
దాడిరి బ్రహ్మవేత్తలు మహామహులేటికి నాలసింపగన్? 27

కం. అని పలికెను విశ్వామి
త్రునిఁగని రాముండు దేవ! దోషస్పర్శం
గననట్టి మీదువాక్కులు
పోసరు ప్రమాణములు పాపపుణ్యంబులకున్. 28

మ. అని సంధించిశరంబువింటను ధనుర్జ్యా స్ఫాలనంజేసి తీ
వ్రపు వేయంగనె నాటిరొమ్మునెఱఁకుల్ మూర్ఛిల్లయా తాటకాం
గన కాళ్లేతులుజన్నుచున్ గిజగిజన్ గాసిల్లుచుం గ్రక్కికొం
న్చురు రక్తంబును నోట ముక్కులను మేనుం బాసె గీపెట్టుచున్. 29

చ. మరియొక కోలనేయ నది మంటలుమండుచు నాకసంబునన్
జుఱుమఱుయంచుఁ గుప్పసమునన్ విడియించిన నాగుబామనం
బఱచి మొగుళ్లచాటుపడి పాఱుచునున్న సుబాహుఁదాఁక బి
ట్టఱచుచుఁదల్లక్రిందుసయియాతఁడుకూలిత్యజించె బ్రాణముల్ 30

ఉ. వేరొకముల్కినేయ వినువీదినిఁబెన్ సుడిగాలిరేఁగి య
వ్వారిగఁజుట్టి యంగములుపట్టసడల్చి ఘనంబు తప్పిపో
నూఱులవేలసంఖ్యలను నూఁకుచుఁ గట్టకడన్ బళా! యపా
రముసంద్రోసి బహుభంగులముంచెనుదాటకేయునిన్. 31

గీ. తాటకాంగనఁగూల్చిన తత్క్షణంబె
తనకు ప్రాణంబు దక్కెదంచును నెఱింగి
యా కరాళుండు మాయలువ్యర్థములని
వడిఁబలాయనమంత్ర జపంబు సేసె. 32

వ. అప్పుడు విశ్వామిత్రుండు శ్రీరామచంద్రునింగని రామా! నీవింకఁ జాపంబుడింపుము. రాక్షసబాధ తొలఁగినది. మనము భద్రంబుగా నుండవచ్చునన నాతండును గురునాజ్ఞ విల్లుడించె. 33

గీ. రేకునలఁగిన యొక పువ్వురీతి రాముఁ
డరుగు దేరలేఁ జెమరాస్యమందు నెలయ
దశరథుఁడు వత్సకుటుంబినుల్ దగ్గఱించి
కౌఁగిలింగొని ముద్దాడి కాంచి రెలమి. 34

వ. ఇట్లుండ. 35

గీ. మహిమగలుగు పలాయన మంత్రదేవ
తనుసుపాసించి సిద్ధిఁగైకొనిన యట్టి
యా కరాళాఖ్యరాక్షసుం డాత్మశాంతి
గదిరి సంతోషపడుచు నొక్కయెడఁజేరి. 36

మ. తలపైనున్న మణికిరీట మదిక్రిందం [illegible] యినిం
గలపెన్గత్తియు డాలు నేలఁబడఁగా గైశ్య [illegible]రంగఁ [illegible]
తులునుంగాళ్లు లుబెందు వాజ మొగిలుఁడు [illegible]
బలెరాముండుశరంబునందఱును మాయా [illegible]? 37

గీ. భూధరముక్రిందడాఁగెనో? భూమిఁగిర్చ
మందుఁజొచ్చెనో? సాగరాభ్యంతరమున
నక్కెనో? యెటనుండెనో? నాకుఁ దెలియ
దెట్లు? నన్నాతఁడెఱుఁగుట యెట్టులింక. 38

గీ. అయిన వెదకెదఁగా కని యచ్చటచటఁ
దిరుగులాడుచుఁ జేరె సాగరముకడకు
నచట మారీచుఁడును సముద్రాంతరంబు
నుండి యెట్టెట్లొ? వెడలుచునుండె నప్పుడె. 39

చ. తడిసినబట్టకట్టుకొని తద్దయుఁ గప్పడఁ జూచుచుండు ; [illegible]
మ్ముడిపయిఁ జిక్కుకోనురుగు మొత్తము: మేనిబలంబు శైషముఁ

గడిగినరీతి వాసనయుఁగన్పడకుండఁగ, నీళ్లనుండితా
నడుగులనీడ్చుకొంచు దరికాతఁడువచ్చెను జిన్నపోవుచున్. 40

గీ. ఎదురుగాఁబోయి రాఁగనే యాకరాళుఁ
డన్న! కనఁబడినావె? నాకన్నులకును
బ్రదికిబట్టనుగట్టితే? రమ్ము నన్నుఁ
గౌఁగిలింపుమా! యనివానిఁ గౌఁగిలించె. 41

వ. అంత వారు పరస్పరాలింగనంబుల నన్యోన్య యోగక్షేమాను
యోగంబుల, నితరేతర విపత్పరంపరాశ్రవణంబులఁగొంత ప్రొద్దు
పుచ్చిన పిమ్మట మారీచుండు 42

గీ. పంక్తివదనుండు కరుణనాపయినెంత
కనఁబఱచుచుండెనో? దానికనుగుణముగ
సేఁగృతజ్ఞతఁ జూపింపనేరకుంటి
నేమొగముతోడఁ జూతునాస్వామినింక. 43

గీ. కానవెళ్లినిరాముని గాధిసూనుఁ
జంపితీఱంగవలె; లేక చచ్చితీఱ
వలయుఁ; గాకెట్లు మనముపోఁబ్రభువునకును
మసలఁబట్టియు ననమూఱుమన్పవచ్చు. 44

వ. అని విచారించుచుండఁ గరాళుండన్నా! మనముప్రయత్న
లోపము సేయుటలేదు. 'యత్నే కృతే యదిన సిద్ధ్యతి కోఽత్ర దోషః'
అనుట వినవే? దైవనియోగము దురతిక్రమము. ఏలవిచారిం
తువు; ఏదేనుపాయంబుఁబరికించి వారినిఁదెగటార్పవలయు నన
క్షణంబు చింతించి మారీచుండు "ఓయీ! కరాళా! కౌశికు
నుండి రామునిఁజీలఁదీసి దూరంబుగాఁగొంపోయి యచ్చట 45

గీ. తన్నుఁ బ్రార్థింపఁగా నీయకున్న కతనఁ
దనదుతండ్రినిఁ గేకసీతనయుఁ డలిగి.
చంపెననువార్తవిని సీత సత్వరమున
వహ్ని దుముకుట మాయఁజూపంగఁ దలయు. 46

గీ. రాముఁడదినమ్ము సీతపై బ్రేమచేతఁ
బరితపించుచుఁ జెలివెంట వహ్ని దుముకు
నంత రాముని కథ సాంతమగును; గాని
కుండు దశరథు నోదార్పఁగూడఁబోవు. 47

వ. అని వచింపఁగ రాఘుండు మారీచుని సన్ను [illegible] చెను.
అంత వారిరువురు రాముని [illegible] [illegible]
వారున్న తావునకుఁబోవ నక్కడ 48

చ. ఁకరముఁ బ్రయాణపుణ్ బడలిక్ [illegible]
శ్వరునకుఁ దెల్పకెయ్యెడకొ శ్రాంతినిఁ [illegible]
దరులనుబిల్వనంపక పదంబులఁ జెప్పలు [illegible]
క్కరువుఁడై జొచ్చె వేఁట [illegible]. 49

గీ. కనుక రామభద్రుని పరిజనము లెల్ల
వెంటనంటుండి' యని యొక్క పెద్ద [illegible]
వినఁబడఁగ రాముసఖుఁడైన పింగళకుని
గొంతు సవ్వడిగాఁ బోల్చుకొనిరివారు. 50

వ. అప్పుడు మారీచుండు రావణునింగని. 51

చ. మన కనుకూలకాలమిది మమ్మరె! పింగళకుండు నానువా
ముని కడకేగుదెంచుటకు ముందుగనాతని గూర్చుచాల్చి “నక

వనగజమొండుపట్టుకొని పర్విడుచున్నదటంచు నేడ్చుచుఁ
వెనుబడి కావవచ్చునతనిఁ దవుదవ్వులఁ జర్చుమా! సఖా! 52

గీ. నేనుగూడఁ గౌశికశిష్యుడైనయట్టి
కాశ్యపునిరూపుఁదాల్చి రాఘవునికొఱకు
విరహమునుబొందు జానకీతరుణిఁజూపి
స్వాభిలాషంబుసిద్ధింప యత్నపడుదు. 53

వ. అని చెప్పి ఆమసన్నగడ కార్యరూపంబుదాల్పఁ జేయఁ జనిరి.
అక్కడ. 54

సీ. కోరచూపులుచూచి కోలవెంబడిలేచి
గర్జించి దుముకు సింగములపిండు
మిడిగ్రుడ్ల మిడుఁగుఱుల్ పడ గాండ్రుగాండ్రని
యలుఁగుబోటుల రెచ్చు పులులగుంపు
ములికితాఁకులఁ దొండముల నడగొండల
గతిని తిగిపెట్టు కరులదండు
ముట్టెలు పయికెత్తి మొగి ఘుర్ఘురించుచుఁ
ఒడు నమ్ముల విదుల్చు పందులగమి

గీ. శరచయముతోడఁగోరాడఁబరుగువాఱు
నడవిదున్నలమొత్తంబు, లంపగతుల
దాఁటిక్రేళ్వాఱులేళ్లమందలునుగలిగి
వేఁటరాముని మిక్కిలి వేడ్కపఱచె. 55

గీ. ముందుగనువానినన్నింటి ములికిగముల
రేఁచియవిచేయు చీకాకుబ్రీతిగొలుపఁ

గనుచుఁదత్తత్స్వభావముల్ కట్టకడకు
నిముసమునవానినన్నింటి నేలఁగూల్చె. 56

గీ. కొంతతడవిట్లు వేఁటాడి కొమరుమిగులు
పొదరుటిండులవేల్పుల పోలుపుగలుగు
చెట్లతండంబు లేతపచ్చికబయళ్లు
కాంచుచావనంబంతయు సంచరించి. 57

కం. ఒకపూవుటీరమునఁ గౌ
తుకమొప్పఁగఁగూరుచుండి చేడ్చెనుమది జా
నకి యంతవాని హృదయ
పరికారమదిమాటిమాటిట్లు పలుకును దనలో. 58

గీ. కలఁతపడినట్టి హరిణార్భకముల రుచిర
చంచలకటాక్షవీచికాచయముకన్న
లలితతరములు జానకీలలన మధుర
విభ్రమాపాంగచయమని వింటిమున్న. 59

కం. కలయనునెపమున నామెకు
వలరాజగపఱపనన్నుఁ బాపము! చిగురా
కులపాన్పులందు సకియల
పలుకులనూఱటనుగనుచు బ్రదుకునఁట! కటా! 60

వ. మరియుఁ గౌశికమహర్షి శిష్యుండును నామిత్త్రుండునగు కాశ్య
పుండు జానకినిఁగూర్చి మున్నిట్లుచెప్పె. 61

చ. నవలకుహంసతూలశయనంబదియున్నను శయ్యనూత్న ప
ల్లవముల, స్వర్ణకంకణకలాపములున్ననుదమ్మితూండ్లె కే

ల్గన ధరియించు, మానససుఖంబిమవీణియయున్న నీగుణ
శ్రవణసుశాంతిఁగోర్చునిటు జానకితో ప్రియపాటునొందెదన్. 62

చ. కడఁగదు స్నానమాడ; మెయిఁగందములందదు; పువ్వుదండలన్
ముడువదు వేణియందుఁ బువుబోండ్లకు నుత్తరమీయదెల్ల య
ప్పాడుగరమందునుంచి మొగమున్, గనుదోయి నశ్రుధారలన్
విడుచుచు నూర్చుచున్ నిదురవీడియలందుదు సీతనీకునై. 63

సీ. కాముదకుట్మలగంధగర్భములయైన
సాంఖ్యమరుసంకురములకుఁ జలదరించుఁ
గలలఁబొందిన నీదుకౌఁగిళులచేతఁ
గడపుచుండును రేలెల్లఁ బడఁతినిన్ను. 64

గీ. నవల స్వప్నసంరంభణములు విన్న
తహతహంప యొకఁడ బిక్కలగుచుండె
లాఁగ కలిమిని ధైర్యంబు లజ్జగూడ
జాఱు; మనసుండుఁ దాసంబుదూరునందు 65

గీ. ప్రియసఖుఁడు గాన్యృష్ణంపు చెప్పినది మదికిఁ
దలఁపునకు రాఁగనాకు సంభ్రమంబువోలెఁ
జలివెలుఁగువెల్గుచే నెద గలఁతఁబొందుఁ
గటకటా! తోఁపదేమి సేయుటకు నేని. 66

మ. స్మరమాయంబలెనున్న యాసుదతినిన్ స్వప్నంబునం దేని జా
గరమందేనియు నేను జూచియెఱుఁగన్, గానీ విచారింపఁద
ద్వాహావస్థను శోకకౌతుక భయవ్రీడాద్భుతానంద సం
భరితంబై కలఁతన్ వహించెడును నాస్వాంతంబవిశ్రాంతమై. 67

వ. ఇట్లు శ్రీరాముండు సీతాయత్తంబగు మనస్సుతోనుండ. 68

ఉ. "చచ్చితిఁ జచ్చితిన్ వనగజంబిదె నన్ను గ్రహించిపోవు నీ
వెచ్చట! రామభద్ర! సఖ! యెవ్వరు నాకిఁక దిక్కు? కావఁగా
నిచ్చట?" నంచెవఁడో యెలుఁగెత్తి విలాపము సేయఁగా నిగో!
వచ్చితివచ్చితిన్ భయము వద్దని రాముఁడు సంభ్రమించుచున్. 69

కం. అటునిటుఁజూచును, బరుగిడుఁ
గటకటపడు నెదియుఁ గానఁగా రాఘవుని నె
చ్చట నక్కజంబువడు; వె
న్కటి మాటలు మరల వినును గలఁతపడుచున్. 70

ఉ. ఈగతిఁ ద్రొక్కటంబడుచు నిట్టటుగాంచుచు నుండుకొంత ద
వ్వేగఁగ నందుఁ బింగళకు నేనుఁగు తో[illegible]ముఁ [illegible]చ్చి నే
వేగను బాఱునట్లు కనిపెన్ వగఁగూలుచు [illegible]
బోఁగ గజంబదృశ్యమయిపోయెను బింగళకుం [illegible]. 71

గీ. కాంచి రాముండు వానిఁ బింగళకి వేష
ధారియైన కరాళుని దగ్గఱించి
యూఱడిల్లుము మిత్రుఁడా! యూఱడిల్లు
మనుచు వీచుచుఁ దనదు పటాంచలమును 72

గీ. కాల్చి వేయుచునుండె శోకంబు మనసు
నావరించుచునుండె మోహంబు నన్ను
నేమి సేయంగఁ దలచితి? విట్టులకట!
పుడమిపై బడిమూర్ఛనుబొందిసఖుఁడ! 73

సీ. అనుచుదైన్యంబుదోఁప మోమునవచింపఁ
గనులువిప్పుచు నెట్టెట్టొ! కాలుసేతు

లనుగదల్చుచు సొమ్మ తగ్గినవిధంబు
నభినయించుచుఁగూర్చుండి యల్లనల్ల 74

వఱమాయాపింగళుండు "మిత్త్రుఁడా! భవదీయమృగయాదర్శన కుతూహలుండనై వచ్చుచుండ మార్గమధ్యమున నన్నొక మదగజము తుండమునఁబట్టుకొని రొమ్ములనిఱికించికొనిపోవుచు [illegible]గర్జితంబువిని భయపడి తటాలున నన్ను విసరిజాఱవిడిచి పోయె." అన రాముఁడు "దదృష్టవశమున నీవుకుశలివైతివి. లేకున్న నాకు జానకీపాణిగ్రహణమంగళంబు గళితంబయియుండు. ఇప్పటికని నీస్థితిఁగని నాగుండెల దడయడఁగలేదు సుమా." అననామాయాపింగళుండు "సఖుఁడా! అట్లుగాదు. నేను లేకున్న నీవు పెండిలి మానుదువా? మానిన జానకి జీవించునే?" యనియె. ఇట్లువీరిట భాషించుచుండ మారీచుండును మాయాబలంబునఁగాశ్యపవేషమును ధరించివచ్చి రామునితో మాటలాడుచున్నవాఁడు యదార్థపింగళకుఁడా? లేక మాయాపింగళకుఁడా? యని సందేహించి పొంచియుండి వారి సంభాషణముల వలనను నాతండుగరాళుండని నిశ్చయింపఁజాలక కౌశికమహర్షి శిష్యుండగు కాశ్యపుండు పింగళవేషము ధరించి కాశ్యప రూపమును ధరించిన తన్ను మోసపుచ్చవచ్చెనని భ్రమించి కరాళుండు పింగళాకృతిఁదాల్ప విశ్వామిత్త్రుండెఱింగి లక్ష్మణునిచేఁ జంపించియుండఁబోలుననియుఁదలంచి వానికై పరితపించుచుఁ "గానిమ్ము. మాయ నవలంబించి యీ రామకాశ్యపుల నిద్దఱను నిగ్రహింతును; దానఁగదామృతులగు సుబాహుకరాళులకు శల్యోద్ధరణమగు"నని తన మాయావిద్యను ధ్యానించె. అప్పుడు రాముఁడు ముందుచూచి మాయాపింగళునితో సఖుఁడా! 75

చ. పసిఁడియనంట్లునెత్తములు, వాఁగులవిచ్చిన తెన్నిస్నపుఁలుఁ, బెం
పెసఁగెడు కేళికాచలమిదే! కనుపండువు సేయుచుం[illegible]; దా
నిసరసగున్న మామిడులునెక్కొనియుండెను-వాటుఁ[illegible]
మునరిన పువ్వుటీరమదె? ముచ్చటగాఁగని[illegible]. 76

గీ. అస్ఫుటములైన మాటలాప్రాంతమందు
వినఁబడెడురమ్మ! చనిచూతమని యిరువురుఁ
గానఁగాఁబోవ నచట సమానమైన
వయసురూపునుగలుగు కన్నియలు గలరు. 77

వ. అప్పుడు రాముఁడు వారలంగని మామాపంగ[illegible] 78

గీ. భుజగకన్యకలో? వేల్పుపువ్వుఁబోండ్లొ?
స్మరవిజయవైజయంతులో? యెఱుఁగఁజెదు
స్మరమయంబుగ శృంగారమయముగాఁగ
కూహాలమయంబుగా నిదితోఁచుచుండె. 79

ఉ. వారిద సంచయంబెడలివచ్చిన చక్కనిమించుతీవనా
వారలలోనొకర్తునవపల్లవశయ్యశయించి యీశ్వర
ప్రేరితవహ్నిఁగాంతుఁడు శరీరముఁబాయఁగఁజిక్కి-శల్యమై
ఘోరవియోగభారమునఁగుందెడునారతినాఁగఁబొల్చెడున్. 80

గీ. కనులుడించుకపోయెలోఁతునకుఁ; బాలి
పోయెఁజెక్కిళ్ళు; కడుఁజిక్కిపోయెమేను;
ఇగిరిపోయెఁజక్కందనంబెల్ల బలితమైన
వెరవేఁకిచేతనీయంగనకును. 81

మ. నడిభాగంబున నెండిరాలినవి గంధంపుఁ రజంబుల్ కనుఁ;
గడచోఁగాటుకకంటినీరుపడుటన్ నల్లంబడెన్; ద్రోయఁగాఁ

బడియెఁ బాఁడిన తమ్మిమొగ్గగములుం బర్యంతమం, దీపెపొం
దెడు సంతాపముఁ బల్లవాస్తరణమే తెల్పుఁ యదార్థంబుగఁ 82

గీ. అతివయొక్కర్తు తామరపాకుసురటిఁ
జల్లఁగా వీచుచుండెనీ సారసాక్షి
మఱియొకర్తుక పన్నీరు మంచిగంద
ముఁగలిపిపూయుచుండెను స్తనములందు. 83

ఉ. ముట్టదు పంచకట్టితో నెమటి నూకుటిపెర్గును గోరువంక;
పట్టదు దాడిమీఫలముఁ బాపము! పెంపుడు చిల్క; దవ్వుగా
నెట్టును దమ్మిమొగ్గగమనింపదు యంచయు; నీవెలంది యి
క్కట్టునుఁజూచి పక్షులును గార్చుచునుండెను బాష్ప
పూరముల్. 84

"ఆపెయెవ్వతెనో?" యన నామాయాపింగళుండును నించుకఁ జింతించి యిది మారీచ మాయాప్రయోగంబని నిశ్చయించి "సఖుఁడా! ఇది కౌశికాశ్రమపరిసర భూమియగుటచే నీపె జానకిగదే" యని రాముండును యుక్తియుక్తంబగు నాతనిమాటయును, గాశ్యపుండు మున్ను దెలిపిన జానకి యవస్థయును దలంచి యీపె జానకిదేవియగునని నిశ్చయించి పైకి "చాలుఁజాలు! నీయసంభావితార్థములు కట్టిపెట్టుము." అనెను. ఇట్టువారిట నుండ నసమయముననే కౌశికమహర్షి శిష్యుండగు కాశ్యపుండు మృగయాప్రవృత్తుండగు రాముని వార్తను గనుఁగొనఁబయలు వెడలివచ్చుచుండెను. అతని దూరముననుండియే కరాళుండు చూచి కాశ్యపవేషధారియగు మారీచుండనియు నీతఁడు వచ్చి రామకార్యసంకేతంబుఁ గావించుననియు, భ్రమించి "సఖుఁడా! నా

పలుకసంభావితార్థముగాదు. నేను బోయి కాశ్యపునిఁగొని వత్తు నాతఁడే నీకు విశ్వాసముఁగల్పించునని చెప్పి వెడలిపోయెను. వెంటనే మారీచుండును "పింగళకుఁడు రామునివద్ద నుండి వెడలెను. నేను గాశ్యపవేషమున రాముని సమీపించి యీప్సితార్థమును సంపాదింతుఁగాక" యని వానిఁ బంపి రామ భద్ర! విజయమగుఁగాక" యని యాశీర్వదించి వానిచే స్పృష్టా లింగితుఁడై "ఈమె సీతయేనా!" యని యడుగఁబడి "యౌ" నని సమాధానపఱచి యాతని సీతానురాగమును బెంచుచుండెను. ఇట్లుండ మున్ను సైనికులను రామభద్రుని వెంటనంటుఁడని యుద్బోధించి తానును బయలువెడలి తిరిగితిరిగి యిచ్చటికి వచ్చి రామునితోనున్న మాయాకాశ్యపుని బరమార్థ కాశ్యపుఁగా భావించి పరమార్థపింగళకుండు సమీపింప రాముఁడును సబహుమానంబుగా "నీ వచనము సంభావితార్థమేయగుఁగాక" యనుఁడుఁ బింగళకుండర్థముగాక చూచుచుండె. మాయాకాశ్యపుండు "ఇతఁడు కరాళుఁడేయనియుఁ గరాళుఁడు మరణింప లేదనియుఁ దలంచి రహస్యముగాఁ "గరాళా! నిన్నింతవఱకుఁ బింగళవేషమును ధరించి కాశ్యపవేషమును ధరించి నన్ను మోసపుచ్చవచ్చిన కాశ్యపునిఁగా భ్రమించి నీవు మరణించితివని దుర్భ్రమపడి మిక్కిలిశోకించితిని. అదృష్టవశమున మరలఁగనఁబడితివి". అనుడు నామాటలును సత్యముగాని మొగము మొఱకటించుకొని మారీచుండు భయపడి నిలిచెను. అంత రాముఁడును ముందుచూపి "పింగళకా! ఇదే! చూచుము ఇంతదాఁక నీవీమెను జానకియని చెప్పి నీవసంభావితార్థ వాదివంటివి. ఇప్పుడు కాశ్యపునిమాటలచే నీవు సంభావితార్థవాదవైతి' వనఁ బింగ

ళుండు మాయాజానకీ విరహావస్థనుగాంచి యాశ్చర్యపడి కౌశికాశ్రమము చాలదూరముననున్న దే? ఇక్కడ జానకి యెక్క డిది! ఇదంతయు మాయగానున్న ది. ఇతఁడు కాశ్యపుఁడు గాఁడు. మాయావియగు రక్కసియొక్కఁడు తాటకా వధకుఁ బ్రతీకారము సేయ నిట్లు వచ్చినట్లు తోఁచుననిభావించి "సఖా! రామభద్ర! ఈమె జానకిగాదు. ఈపరిజనమదికాదు. ఈ యరణ్యమున నిదియసంభవము. ఇదంతయు మాయగానున్న ది!' యని రామునితోఁ బూర్వాపర విరుద్ధముగానున్న పింగళుని వచనముల నమ్మకుండెను. మాయాకాశ్యపుండును రామునితోఁ బింగళకునిఁజూపి "ఈతఁడెవఁడోరక్కసి. తాటకావధకుఁ బ్రతి క్రియ గావింపఁ బింగళవేషము ధరించి వచ్చె "నని చెప్ప నాతం డును నమ్మి" మనపింగళకుఁడు వచ్చినపిమ్మట వీనిని సంహరిం పుదమనఁ బాపము! పింగళకుఁడు "వయస్యా! అన్యుఁడ ననికూడఁగాదు. కేవలము రాక్షసుడఁనని భావించితివి. బాగుగా విమర్శింపుము". అని చెప్పి వివర్ణముఖుఁడై యూర కుండె. అంతమారీచుండును మాయావిద్యమరలనావర్తింప 85

ఉ. "ఈశిశిరోపచారముల నింతయుఁగల్గదు నాకుఁదాపబా
ధాశమ; మెట్టు లుత్పలిని తాఁబగటన్ సుఖయించుమేఘ ధా
రా శతకంబుచే "ననిధరాసుత వల్కఁగ రామచంద్రుఁడో
పేశలగాత్రి! వచ్చి సుఖపెట్టును లెమ్మని చెప్పెఁ జేటియున్. 86

కం. చేటికపలుకులకు గగు
ర్పాటునువహియించు నిలిచి రాముఁడు ప్రియమా
పాటకు నాగేంద్రుని పరి
పాటిగఁదాండవము సేసెఁ బరహర్షమునన్. 87

వ. ఇట్లుండ మున్ను పోయిన మాయాపింగళుండగు కరాళుండు వచ్చుచున్న పరమార్థకాశ్యపుని మాయాకాశ్యపుండగు మారీచునిగా భావించి దగ్గఱింపఁ గాశ్యపుఁడు సఖా! మృగయాప్రవత్తుండగు రాముఁడగపడెనా? యనఁగ రాళుండు "అగపడకేమి? నీవు చెప్పినట్లు చేసితిని. నీవింతవఱకును గానఁబడకుండుటవలన నీవు లక్ష్మణునిచే సంహరింపఁబడితివని దుర్భ్రమపడి దుఃఖించితిని. ఇప్పుడా రామహాతకుఁడు జానకినిఁ జూచుచున్నాఁడు" అనఁ గాశ్యపుండును గొండొకవడిఁ జింతించి "ఆమె పరమార్థజానకియేనా?" యనఁ గరాళుండు "ఓయీ! మారీచా! సర్వమును మాయచేఁ గల్పించి మరలఁ బరమార్థ జానకియేనా? యని నన్నడిగెదవేమి? యనుడు

ఉ. పింగళకుండు గాఁడితఁడు వేషముదాల్చిన రాక్షసుండు; న
న్నుంగని స్వీయుఁగా ననుకొనెఁ మరి రామునివద్ద నాదు సహా
యుంగొని తాటకాత్మజుఁడు మోసము సేయుచునుండఁబోలు; బి
ట్టుంగద సంభవించెనకటా! తెలియంబడె వీరిమోసముల్. 89

ఉ. కాలము దాపరించినది కట్టు! కటా! యిఁక నాకు; నన్ను వీఁ
డేల వధింపకే విడుచు; నెవ్వరుదిక్కని కాశ్యపుండు శా
ర్దూలము డాసినట్టి పసితోవ నిలంబడియుండె నెల్ల ప్రా
ణాలను మూటఁగట్టుకొని నాకము దిక్కులు సూచుచుండఁగన్. 90

చ. నిలువఁగ నిట్లు తండు జననీమృతిజ్ఞప్తికి వచ్చి బిట్టుకొం
దలపడుచున్నటుల్ తలఁచి దాసి మెయిం జెయివేసి దువ్వి చిం
తిలవల; దూఱడిల్లు; కసితీఱును లెమ్మిఁక సంతసమొందు దు
ర్గలితుఁడు రాముఁడంచును గరాళుఁడు పల్కెను బుజ్జగించుచున్. 91

గీ. పలుకఁగాశ్యపుఁడంత సంజలిఘటించి
నేను నీమమారీచుండఁగాను; నన్నుఁ
జంపవలదని ప్రార్థించెఁ గంపమెత్తి;
ఆకరాళుండును వెఱగుతో సతనిఁగాంచి. 92

వ. ఇతఁడు పరమార్థకాశ్యపుఁడు. మాయాకాశ్యపుఁడని భ్రమించితిని. విశ్వామిత్త్రుఁడు కాశ్యపవేషముఁగొన్న మారీచుని లక్ష్మణునిచేత నిజముగాఁ జంపించియేయుండును. రాముని వలెనే లక్ష్మణుండును సమర్థయుండు. కనుక వీనినిఁజంపి మారీచమరణశల్యోద్ధరణము గావింతునని 93

గీ. గ్రుడ్లుఱిమి పటపటపండ్లుకొఱుకుకొనుచుఁ
గాశ్యపునిగొంతునులుమఁగాఁ గరముసాఁప
రామభద్ర! రక్షింపు మీరాక్షసుండు
ననుదునుమవచ్చెననుచు రామునిగమించె. 94

చ. పరువున నాకరాళుఁడునువచ్చి కడుంగడు రోఁజుకొంచుఁదాఁ
గరమునఁజూపి నిల్చుకొను కాశ్యపు రాఘవ! వీఁడురాక్షసుం
డఱిముఱిఁ జంపరాఁగననునార్చుచునేడ్చుచు నిన్ను వేఁడఁగా
శరణమువచ్చుచుండఁబెలుచన్ నినుడాసెనునాకుముందుగన్. 95

వ. అనినవుడు రాముండును నిద్దఱుకాశ్యపులను, ఇద్దఱు పింగళకులఁ జూచి దిగ్భ్రాంతుండయ్యె. పింగళకాశ్యపులను మాయాపింగళకాశ్యపులను జూచి వెఱగుపడుచుండిరి. అప్పుడు మాయాపింగళకాశ్యపులు తమ్ముగుఱుతుపట్టకొని తాము జీవించియున్నందులకు నాత్మలసంతసించి పింగళకాశ్యపులఁజూచి రామభద్రునితో 96

గీ. రామభద్ర! వీరురాక్షసుల్ మాదగు
వేషములనుదాల్చి బెట్టిదంబు
సలుపవచ్చినారు; సత్వరంబుగవీరి
సంహరింపకున్న జరుగుఁగీడు. 97

వ. అనిన రాముండును వింటినెక్కిడి 98

చ. ప్రియసఖులంచు డెందమున వేరిఁ దలంతునొ? వారిమీఁద నే
ప్రియతకుమాఱసూయప్రభవించెను; రాక్షసులంచు వేరి న
త్యయమొనరింపఁబూనితినొ తద్దయుఁజాపమునెక్కువెట్టి పెన్
దయజనియించువారిపయి నాకిప్పుడేమి యొనర్పఁగాఁదగున్? 99

వ. అని సందేహించుచుండె మారీచుండును మాయావిద్యను
ధ్యానింప 100

గీ. గ్రుడ్లఁగన్నీటినిం గ్రుక్కుకొనుచున్న
పుచ్చుకొన్నమొగాలతో వచ్చితారు
నిలువఁగాఁబడి జానకీలలనమ్రోలఁ
గొందరాండ్రురు చెప్పడగ్గుత్తికవడి 101

వ. ఎట్టకేలకుగొంతు సవరించుకొని జానకీ! 102

మ. నినుమున్ గోరఁగ రావణాసురుఁడు పెండ్లింజేసికోనెంచి యా
జనకక్ష్మాపతి యీయఁజాలనని నిశ్శంకంబు వాక్రువ్వ నా
తనిపైఁగ్రోధమునన్ దురాత్మకుఁడనర్థంబాచరించెన్; మరిన్
నినుఁగైకోనతఁడేగుదెంచునిటకున్ నేడింకనెట్లో? గదే! 103

ను. అనుమాటల్ విని జానకీరమణి యయ్యయ్యో! మృతింబొందెనే
జనకుండంచును నెత్తినోర్మొగమువక్షంబుంగడున్ మోఁదుకొం
చునునేలంబడిదొర్లుచున్ గనుల నశ్రుల్ కాల్వలైపాఱ మూ
ర్ఛనుబొందంబొనరించిరా వెలఁదుకల్ శైత్యోపచారంబులన్. 104

వ. పింగళకాశ్యపులిదిగని యక్కజపడుచుఁ జూచుచుండిరి. జానకి యుఁగొంతసేన శైత్యోపచారంబులఁదెలివిడిఁగొని విలపించు చుండె రాముండు 105

గీ. ఈనిశాటులఁ జంపంగ నెత్తినట్టి
వింటఁబూవును సంధించి వెలఁదిమిన్న!
మానసకుఁ బ్రసవంబును జలిపినట్టి
రావణుని సంహరించు విక్రమము మెఱయ. 106

వ. అని యెలుగెత్తుచుండఁగ జానకియు 107

చ. పితృమరణంబుచేతఁ బ్రభవించిన శోకభరంబునాఁడు జీ
వితపతిరామచంద్రుకయి బిట్టుగఁగొన్కయనంగతాపముల్
హృతమగు నిప్పుడేయనిదరీ రగులంబడు కాఱుచిచ్చునం
దతివలులాగుచుండినసుహస్తములఁ దుమికేఁ విదుల్చుచున్. 108

వ. అని నారదుండు చెప్పిన వాల్మీకిముని విని 109

మ. స్వకులాచారపరంపరాచరణరక్షాదక్షిణా! ఆంధ్రవా
ణికటాక్షాంచిత రమ్యమూర్తి! సుమహానిష్టాప్రతిష్టాశ్రయా!
సుకవిగ్రంథమణీకవిత్వరచనాస్ఫూర్జత్ప్రియంభావుకా!
అకలంకాత్మచరిత్రమండితసమస్తాశావనీమండలా! 110

కం. శ్రీ రెడ్డివంశవరము
క్తాగత్న! సుధాసుమధురకమ్రవచస్కా!
ధీరా! లక్ష్మాంబా శృం
గార సమాలోకలుబ్ధగాఢస్వాంతా! 111

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

## చతుర్థాశ్వాసము.

కం. శ్రీలక్ష్మాంబాకంఠ
ప్రాలంబాయితమనోజ్ఞబాహాలతికా!
శ్రీలలనాధవభక్తా!
సాలంకృతి లలితదేహా! శంకరరెడ్డీ! 1

వ. అవధరింపుము. 2

గీ. అట్లు కృత్రిమ జానకి యగ్నిదుముక
రాముఁడును వెంటనంటెనే? ప్రాణసఖుని
తోడఁబింగళకాశ్యపుల్ కూడఁబడిరె?
యాకరాళమారీచులేమైరి దేవ! 3

గీ. అనుచుఁబృచ్ఛించు వాల్మీకిమునివతంసు
బహుతపఃపరిభావప్రగల్భంబులయిన
కనుల తేజోంబువులను సించనము సేయు
చాదరంబున నారదుఁడాలపించె. 4

గీ. ఓలిమారీచమాయాప్రయోగసృష్ట
కపటజానకియాగతిఁగాఱుచిచ్చు
నందుఁబడనాపె చెలికత్తియలునునొక్క-
మొగినిగగ్గోలుపుట్టనేడ్పులకు దిగిరి. 5

మ. త్రిజగన్మంగళ దీపికా! జనకపుత్రీ! ప్రేయసీ! నీవు లే
నిజగంబెల్ల యువల్ల కాఁడుగను గాన్పించున్; సఖీవత్సలా!
నిజవాత్సల్యముఁ ద్రోసిమమ్మువిడిపోనీకెట్లు? తోఁచెన్ మదిన్
గిజిగాఁడట్టులు; నీవులేకలలితాంగీ! మేముజీవింతుమే? 6

ఉ. ఊఁదరపెట్టఁబడ్డగతి; నూపిరితిత్తులుపట్టినట్లు; లో
లోపలసితల్లక్రిందయిన త్రోవ; నోకానోక నిప్పుకొండ మా
మీఁదను బ్రద్దలైనక్రియ; మేదినికంపము గల్గినట్లుగా
నీదుమృతింగనుంబెడఁద నేము వహింతుము జానకీ! సఖీ! 7

గీ. ఓదవానల! నీలోనికుఱుకఁబోవు
మాదుజానకి వలదనిమలపవేల?
అనుదినమునిన్ను హావియించునట్టి జనకు
కూఁతుదిగ్రమింగితివి కృతఘ్నుఁడవుకావె? 8

ఉ. నీకసితీఱఁగా! యిప్పుడునీచ! దురాత్మక! రావణాధమా!
మాకులమండనున్ జనకుమంగళమూర్తి నిఁజంపిదాన సీ
తాకమలాక్షిఁగూల్చితివి; దానను మేమును వీడుచుంటి మీ
లోకముఁ, బ్రాఁకియీయఘములోఁతుగ నీదుకులంబుఁ
గూల్చెదున్. 9

గీ. అనుచుఁగడుప్పు తఱుగుకొని పోవనేడ్చుచు
నెత్తి మోఁదుకొనుచు నేలఁబడుచు
బ్రదుకు టేల? యింక వదలిజానకినని
యందరొక్కమొగిని నగ్నిఁబడిరి. 10

గీ. అల్లపింగళకాశ్యపులావిషాద
నాటకముగాంచి శోకంబునకునుబదులు

విస్మయముఁబొందుచుండిరు ద్వేలముగను
కడిఁదివెతఁగొని రాముఁడుగాంచుచుండె. 11

గీ. ప్రియుఁడ! యీచరితంబు మారీచమాయ
సత్యదూరంబుగా నమ్మ; సంభ్రమింప
వలవ; దిదికౌశికాశ్రమప్రాంతభూమి
గాదు; సరిగవిమర్శింపుమాదుమాట. 12

కం. అనుపింగళకాశ్యపుల వ
చనములువినియును విమర్శలుపకయమొగఁ
బును జెండుకొనుచుఁ జేకొ
ట్టును బొమ్మనురామభద్రుఁడుగడుంగినియుఁ. 13

కం. వెలవెలపోవుచునాపిం
గళకాశ్యపులట నిలిచిరి; క్రవ్యాదులులో
పలఁగులుకుచుఁజంపఁగవా
రలనుంద్వరపెట్టుచుండ్రు రామునిఁగడిమిఁ. 14

వ. ఇట్లుండ రామభద్రుండును 15

గీ. అగ్నిఁదుముకుచనుఁగూర్చియతివయన్న
పలుకుములికిపోలిక నెఱుంకులకునాఁటి
తలఁచుకొనినప్పుడెల్లఁజిత్తమునఁబోటు
పొడిచినట్లుండఁబెనుబాధపడుచునుండు. 16

గీ. నామనోరథ తరువుభగ్నమయిపోయె
భూమిభూషణమదినాశమునుగమించెఁ

ప్రాణికోటికి నేత్రోత్సవంబుదీర్చె
నకట ! నిప్పాలదుమికి జానకి మృతింప. 17

చ. ఎడఁదనుబుంజపుట్టినరహిన్; దగునాసుకృతంపుఁగోఁటపా
డ్పడిన తెఱంగునం, దగులఁబడ్డటుశాంతిగృహం, బదృష్టపున్
గొడుగజారినట్లు, పుచ్చిపురుగుల పడి క్రుళ్లినయట్లు లేవగొ
ల్పడుఁగడునాదుజీవితము లేదిఁకలోకము నాకు జానకీ! 18

గీ. పూఁతపట్టంగనున్నట్టిపూవుఁజెట్టు
నిట్టనిలువున నెండిమోడియయిపోయెఁ
బట్ట పగలింటమిక్కిలిదట్టములయి
కటికచీఁకట్లుపర్వెనల్గడలయందు. 19

గీ. క్షుభితహృత్సింధు వీచికాస్తోమమట్లు
తెరలు తెరలుగఁబయటికిఁబొరలివచ్చెఁ
బెనునిరాశయు భీతియు వెతయుఁగడిఁది
నూపిరాడనీయక ముంచుచుండెనన్ను. 20

గీ. దేహబంధంబు సడలెను దీప్తితఱిగె
బరువుగాఁదోఁచుచుండెను బ్రాణములును
బండవాఱెను బుద్ధియు మండుచుండె
దేహమాద్యంతమింకేమి దిక్కునాకు ? 21

ఉ. చిక్కినమేనొగింజిగురుసెజ్జను జేరిచి కొల్చుచుండఁగాఁ
బ్రక్కలఁజేరినెచ్చెలులుపాడ్యమి చందురమామరేకనా
మిక్కిలినేత్రపర్వముగమింపఁగఁజేసినయాలతాంగివో
యక్కట! యిట్లుదైవగతినయ్యెననర్ సహియించుటెట్లొకో! 22

చ. అనివిలపించు రాముఁ గని హర్షము నొందుచు లోనఁ దాటకా
తనయ కరాళు లాతని వెతల్ ద్విగుణీకృతముం బొనర్ప ని
ష్ఠునుద్ధృతి నూఁదు నట్లనలముల్ వడిఁ జొచ్చు నటంచు నెంచిహా!
జనకసుతా! ప్రసన్నమతి! సాధుగుణా! కడ తేఱితే? యిటుల్ 23

గీ. అనుచు నేడ్పులుఁ బెడబొబ్బలును జెలంగ
నడుమనడుమ నొండొరుల నూఱడిలఁ జేసి
కొనుచుఁ గన్నీటి నిండుచ్చుకొనుచు రామ
భద్రుకంబెను బరితాపపడుచునుండ్రి. 24

వ. అప్పుడు రామభద్రుండును 25

మ. గిరిపై నెక్కి తటాలునం బడుదునా? క్రిందన్, సముద్రంబునం
జొరఁగాఁ బోవుదునా? శరీరముఁ గఠారాగ్రాన్ వడిం ద్రుంతునా!
గరళంబున్ భుజియింతునా! యెదుటి యీ కార్చిచ్చునం దూఁకి నా
తరుణిం గూడుదునా? మఱెవ్విధిగఁ జిత్తంబూఱటం బొందెడున్. 26

వ. అని దవానలంబు వైపునకుఁ బఱచుచుండ.

గీ. పింగళిక కాశ్యపులు చూచి వేఁడికొన్నఁ
దమదు పలుకుల విలువ సుంతయును లేమిఁ
బొగులుచుండిరి; రక్కసుల్ పొంగుచుండ్రి
తమ మనోరథ మీడేఱుఁ దప్పకనుచు. 27

గీ. కాఱుచిచ్చున దుముక నక్కడఁ గలట్టి
గండశిల నెక్కి యొక పాదకంజముంప
ఘనకచంబును బీనవక్షోరుహములు
వల్కమును దాల్చు ఋషిపత్ని వలెఁ జెలంగి. 28

చ. జయ! జయ! రామభద్ర! గుణసాంద్ర! దయాకర! పురుషోత్తమా!
జయ!జయ! జానకీప్రియ! యశోవృతసర్వదిగంతరాళ! యం
చుయువతి యొర్తు లేవఁగను జూచుచుఁ జిత్తరుబొమ్మలట్లుగా
నయిరటనున్న యా రఘుకులాగ్రణిదొట్టిగ నెల్ల వారలున్. 29

గీ. వెలవెలంబోయియొండొరులను జూచు
కొనుచు మొగములఁ జిటిలించుకొనుచు ముఱిక
టించుకొనుచు నేదొ? గొణుగుకొంచులోనఁ
జూచుచుండిరి యారాక్షసులును నిలిచి 30

వ. అట్లులేచి యాసుదతీమణి 31

చ. పరుషితభర్తృశాపమునఁ బ్రస్తరమైపడియుంటిఁ బెక్కువ
త్సరములనుండి నాదు నభిధానమహల్యయనంబడున్ భవ
చ్చరణసరోజరేణువులస్పర్శముచేతఁ బవిత్రనైతి శ్రీ
కర! యిటు శాపమోచనముఁగాంచితి ధన్యతఁగంటి నేటికిన్. 32

చ. అనవిని మున్నె కౌశిక మహర్షి వచింపఁగఁదచ్చరిత్రమున్
వినుకలినొందియే యునికిఁ బెంపువహించినభక్తితోడ వం
దన మొనరించి దీవనలుదాల్చెను బింగళకాశ్యపుల్ తగన్
వినయము మ్రొక్కె రాఘవుఁడు వ్రేలను జూపుచు వారినాపెకున్ 33

గీ. జనని! వీరెవ్వరనుడు నాసారసాక్షి
పింగళకకాశ్యపులె”యనె; వీరలెవ్వ
రనెను మిగిలిన యిద్దఱ; రాక్షసులనె;
భయపడుచు వారు మృగములై పఱచిరంత. 34

ఉ. నాయన! రామభద్ర! రఘునందన! వీరల మాయఁజిక్కియ
త్యాయతమైన క్లేశములనందితి చూడుము వీర్మృగంబులై

తీయుచున్న వార్వురుగుఁ డేఁగువ వీరి వధింపుమా! యనం
బోయెను వాయువేగమున ముందుగఁ బర్వెడు వారివెంబడిన్. 35

ఉ. రాముఁడు వింటనెక్కిడి శరంబు బలంబున నేయఁ బాఱుచున్
మోమునఁద్రిప్పి వెన్కనయిఘ్రంగనుచున్న కిరాతుఁగాఁడుఁగా
భూమిని రాక్షసాకృతినిఁబూనుచుఁద్రెళ్లెను దాశసన్నిభుం
డై మృగరూపమున్ విడిచియాతఁడు వేల్పులు సంతసింపగన్. 36

గీ. మాయికాగ్రణియగు తాటకేయుఁడప్పుడు
తనదుమృగరూపమునువీడి తాల్చుచుండి
పెక్కురూపులు రాముఁడబ్బిబ్బుపఱచు
చున్నఁగూడను నవ్వానిమన్ను సేసె. 37

గీ. జనని! తొలిరూపుఁగొనితదృష్టముననీవు
నీదుపలుకున రక్కసుల్ నేలఁబడిరి
తప్పెమారామభద్రునిముప్పు; మేము
బ్రదికితిమి; దైవమనుకూలపడెనుతెన్న. 38

వ. అనియంజలిఘటించి పింగళకాశ్యపులును “అమ్మా! నీవలనమే
మనుగ్రహింపఁబడితి”మని రామచంద్రుండునువచింప నాయహ
ల్యయు. 39

గీ. రామ! త్వత్పాదపద్మపరాగధూత
పాపనైతిని! నీకుఁదొంటివలెను దిరిగి
నాప్రియునిడాసిశుశ్రూషణంబొనర్తు
నభ్యనుజ్ఞనుదయసేయవయ్య! నాకు 40

గీ. అనుడు రామభద్రుండు వందనమొనర్చి
సెలవు సూచింప “భాస్కరకులవతంస!

జానకినిఁ బెండ్లియాడి రాక్షసుల నెల్లఁ
జంపి ముల్లోకములను బాలింపవయ్య!" 41

కం. అని ముఖ్యముగాఁ గావల
సిన దీవన లిచ్చి చనియెఁ జెలువయు వేవే
గను దనపతియగు గౌతమ
మునిచంద్రుని సన్నిధానమునకుం బేర్మిన్. 42

వ. అంతట 43

మ. సఖులం డగ్గఱి రామచంద్రుఁ డెదఁ బశ్చాత్తాపముం బొందుచున్
ముఖమున్ వంచుక లజ్జ వేఁగునఁ బలేన్ మూకుండుగా నిల్వఁ శ్రీ
మఖినుల్ పింగళ కాశ్యపుల్ కరములం బైవైచి యుర్వంకలన్
సుఖసంశ్లేషముఁ జేసి వానివెఱపుం బోఁద్రోలి శాంతింగనెన్. 44

గీ. కాననిట్లుండ వారు పింగళకునాజ్ఞ
మున్ను వెడలిన సేనాసమూహమచట
నచట రామునన్వేషించి యిచటికేగు
దెంచుచుండిరి యార్భటుల్ మించుచుండ. 45

వ. అప్పుడు 46

సీ. భటుల క్ష్వేళలకు సంకటపడి పయికెత్తి
కరములు గీపెట్టు కరులగుంపు
గజముల పెద్దగీఁకలకు భయంపడి
యొత్తైన చెట్లెక్కె నెలుఁగుబంట్లు
ఎలుఁగు మొత్తములు చెట్లెక్కుచుండంగ గ
గ్గోలుపుట్టియుఱుకాడు కోఁతులగమి

కోఁతులబలఁగంబుకొమ్మలయూఁకకు
బిలబిలమెగిరెడు పులుఁగుగుంపు

గీ. మరియుఁదమబిడ్డలనునోటఁగఱచిపఱచు
నడవిపిల్లులు, ( గ్రేళ్లువాఱెడుమృగములు
బొఱియలనుదూరుచుండు జంబుకచయంబు
గలిగిపెనుసందడినిఁబొందెఁగాననంబు. 47

వ. అప్పుడు మధ్యాహ్నంబగుడు 48

సీ. శరణంబుగోరిన తెఱఁగునఁబాంధుల
చరణముల్ సేవించెఁదరులచాయ
కకుబంతరాళంబుఁగాంచుటకుంబోలె
వడినాకసంబెక్కె భాస్కరుండు
తృషితయై స్వప్రియార్పితమైన చిగురుటా
కునుజూడకయయుండెఁగోకిలయును
అలసటగొన్న ప్రియంగాంచితనపక్ష
మారుతంబునవీచెమధుకరంబు

గీ. వేఁడిమినినోర్వఁజాలక వెడలుచుండె
నడవిదున్నలు మడుఁగులయందునుండి
కాళులునుగాలుచుండెనునేలగాలి
మండుమంటలునానెండమావులడరె. 49

వ. దానినెల్లయుఁబరికించి 50

గీ. నిండుజవ్వనమిపుడొందియుండెదినము
కానలోమనకోసమై సైనికతతి

నెదకుచునువచ్చుచున్నది వెడలివారిఁ
గలసికొందము రండనిపిలుచుకొనుచు. 51

వ. రామభద్రపింగళకాశ్యపులు బయలుదేరి తమస్కంధావారంబు
గలిసికొని యెల్లరులుదమయునికి పట్టునకుబోయిరి. అచ్చటఁ
బింగళకాశ్యపులు జరిగిన కథనంతయును విశ్వామిత్రమహర్షికిఁ
దెలుపనాతఁడును వెఱగుపడెను. పిమ్మట నెల్లరును మిథిలకుం
బ్రయాణమైచనిరి. ఇట్లుండ శుకసారణదశగ్రీవులును రామ
లక్ష్మణవిశ్వామిత్త్రుల రూపములుదాల్చి పరమార్థ రామ
లక్ష్మణ విశ్వామిత్త్రులకన్న ముందుగనే 52

గీ. దివ్వెసిగవలె; మంగళదేవతవలె;
ముత్తియమువలె, బంగారుబొమ్మయువలె
జానకీకన్యకామణి సవురుగూర్చు
ట్టిజనకునిపర్ణగృహంబుసేర. 53

ఉ. వచ్చినఁగాంచివారలను ద్వారమునందుఁగలట్టి సేవకుల్
చెచ్చెరనావిదేహపతిచెంతకునుంజని యోమహాప్రభూ!
"వచ్చిరిరామలక్ష్మణులు భవ్యమునీంద్రుఁడు కౌశికుండు" నాఁ
గ్రచ్చఱదోడితెండనుచు రాజునునానతియిచ్చెవారికిన్. 54

వ. అట్లానతిచ్చి దగ్గఱనున్న శతానందునింగాంచి. 55

గీ. దాశరథియుగ్మమునుగూడి కౌశికముని
యరుగుదేరంగనాదు గృహంబునకును
శఫరఘట్టితనాళకంజంబురీతి
సంచలించెడు నామానసంబదేల? 56

గీ. అనుచు జనకరాజర్ఘ్య పాద్యములఁ దేరఁ
బనిచి తాను శతానందమునినిఁగూడి
వినయమును భక్తియును శ్రద్ధయును బెనంగ
నెదురు నడ తెంచుచుండెను నింపునింపఁ. 57

సీ. కార్యసిద్ధిని నమ్మకము పూర్తిగాలేమి
గుండెలు తటతటకొట్టుకొనఁగఁ
బలుకులఁ దబ్బిబ్బుగలుగనో? యనిచెప్ప
వలయు మాటలుగూడఁ బలుకుకొనుచు
నడుపఁబోయెడు తంతుకడముట్టచక్కఁగా
మించ మెల్లఁగ హెచ్చరించుకొనుచుఁ
దమ తాల్చు రూపముల్ తగినట్టులుండెనో?
యనుచు నొండొరువుల సడుగుకొనుచు

గీ. హృదయమునలేని సౌజన్య మదుకుకొనుచు
మొగముపయి, నేమిటంగూడఁ బొల్లురాని
యట్లు మెలఁకువపడి రాజు నంతికమున
కరుగుదెంచిరి దశకంధరాదులపుడు. 58

శా. మాయా కౌశికుఁగాంచి మ్రొక్కి జనకక్ష్మాజాని తా "స్వస్తి తే
భూయా త్తంచు వచించి కన్నుగిలిపెన్ మ్రొక్కెన్ దశగ్రీవునిన్
భూయోఽహంకృతి దోషదూషితమతింబోవండతండుండగం
జేయందండము విప్రతీపమనుచున్ జింతింపఁ డొక్కింతయున్. 59

చ. ఎవని నమస్కరింపఁగ దిగీశ్వరులునుంబడగాఁపు లౌదురో?
ఎవఁడభిమానియాటను నిజేందుముఖింబ్రణయాపరాధనో

దవిధికినిఁ సహింపఁడో యథార్థముగా నెరఁగంగ; నెట్లు మా
నవునకతండుదండమిడు; నాననుమూలఁకుఁ ద్రోసిపుచ్చుచున్.60

వ. అని మెల్లఁగ మాయారాముండగు రావణుండు మాయా లక్ష్మణునితో నన నతండును "దేవా! మనము ప్రస్తుత విప్రతీపం బాచరించుట తగ" దన నాతండును నెట్టకేలకు సమ్మతించి నమస్కరించిన వెంటనే మాయాలక్ష్మణుండును నమస్కరించెను. జనకుండును వారినిద్దఱను నాశీర్వదించె నంత శతానందుండు మాయాకౌశికుంగాంచి. 61

మ. "నియతిన్ షష్టిసహస్రవర్షములనుండిన్ సత్తపశ్చర్యనుం
డ యమిశ్రేష్ఠుఁడు ఋష్యశృంగుని దయం బ్రాదుర్భవంబొందిర
వ్యయ తేజస్కులు నల్వురాత్మజులు దివ్యద్దివ్య మూర్తుల్ మహా
నయులా పంక్తిరథక్షితీశుకని విన్నామాత్మ హర్షింపఁగన్. 62

గీ. ప్రాయమునఁ జేష్టితముల రూపమునయందు
నొకరి నొక్కరుపోలుచు నున్నవారు
పోలుచు వీరలయందు రాముండెవండు
లక్ష్మణుండెవ్వఁడగును? దెల్పంగవలయు. 63

గీ. అనినఁ గృత్రిమకౌశికుండను నితండు
రాముఁడు నవాబ్దనీల విగ్రహుఁడ; తండు
లక్ష్మణుండు ద్రుతస్వర్ణ లలితమూర్తి
యొండొరులు ప్రేముడినిగల్గియుందు రెపుడు 64

వ. అనిన జనకుండును. 65

చ. "తనయులుగల్గిరా దశరథక్షితివర్యునకన్న మాట మున్
వినితినిఁ గర్ణపేయముగ నేఁడిటఁగాంచితి నేత్రపర్వముం

గొనితిని నింక వీరలకుఁ గూఁతుల జానకి నూర్మిళాసతిం
దనరఁగఁ బెండ్లి సేసినఁగదా! పరిపూర్ణత నొందు భాగ్యముల్. 66

గీ. కాన మీరలు యజ్ఞదీక్షాప్రవేశ
ముసు బొనర్పంగవలయు మేము నీకఁ ద్వరగఁ
బెండ్లికూఁతుల సేతుము బిడ్డల" నని
పలికి వరవుల్లకటు సేయఁ బలికె నప్పుడె. 67

వ. ఇచ్చట నిట్లుండ నొకనాఁ డింద్రుండు నిండుకొలువునఁ గూర్చుండి యుండ. 68

గీ. తాటకాసుబాహుక రాళ తాటకేయ
రాక్షసుల వీఁచమడఁచి యా రాఘవుండు
తనదు పత్తనమునకును బనిపినట్లు
యముఁడు శుభవార్త నింద్రునకంపనప్పుడు. 69

గీ. దానివిని "సర్వరాక్షస తతివినాశ
మునకు నంకురార్పణ జరిగెనె?" యటంచు
నొడలు గఱుపార హర్షంబు గడలుకొనఁగ
నుత్సవము సేసె నుత్సాహముప్పతిల్ల. 70

వ. పిమ్మట. 71

గీ. స్వజన నాశంబు వినిన నిశాచరేంద్రుఁ
డేమి యాలోచనంబు నూహించినాఁడొ?
తెలిసికొని రమ్మటంచొక దిట్టయైన
యక్షునింబంపె లంకకు నానతిచ్చి. 72

ఉ. ఆయతఁ డొక్క రాక్షసుని యట్టులు వేషముఁదాల్చి లంకకుం
బోయి సమస్త పత్తనము మూలలు సందులు రాజవీధులున్

రోయుచురాష్ట్రవార్తలను గ్రుమ్మఱుచున్న నెఱుంగ రామినిం
జేయున దేమిలేకనిలిచెన్ మగుడన్ వెడలన్ నిరాశుఁడై. 73

వ. ఇట్లొకచోటనిలిచియుండ 74

గీ. తుప్పతల, బొంటెమొగము, దుందుభినిఁబోని
బొజ్జ, చినపెద్దచనుఁగవ, పొడుగుపొట్టి
చేతు, లేనుగుకాళ్ళు, దాల్చినయొకర్తు
వానిదగ్గఱకేతెంచె వడిగఁజనుచు. 75

ఆపెయునాయక్షునింగాంచి "ఓయీ! నీవుకరాళుండవా? లేక యన్యుండవా?" యననాతండును గరాళుండు రామశరనిహతుండయ్యెఁగదా! ఈపెకరాళునికి సంబంధించినదేమో? సంభాషణమువలననేమైనఁ దేలఁగలదని తలంచి "ఔను! నేనుగరాళుండనే" యనియె. ఆపెయునీవు రామునిబాణమువలన మరణించితివని నీభార్యగుండెలు మోఁదుకొనుచు నేడ్చుచున్నది. నీవురాయివలెనుంటివి. నేనువెంటనేపోయి నీభార్యకీవృత్తాంతమును దెలిపి పారితోషికముఁగొందును." అనిబయలుదేరుచుండగా "సరియే! అట్టులనేపొమ్ము! కాని నీవిపుడెక్కడనుండి వచ్చుచుంటి" వన నన్నమందోదరి సారణుని యింటికిఁబోయి "మహారాజు రావణుఁడెందుఁబోయెఁ" గనుఁగొనిరమ్మనిపంపనేఁబోయి సారణుఁడింటలేమినాతనిభార్యనడుగ నాపెయు మాయారామలక్ష్మణ విశ్వామిత్రుల వేషములఁదాల్చి శుకసారణ దశగ్రీవులు కౌశికాశ్రమమునకుఁబోయిరని తెలిపెను. ఈసంగతిని మందోదరికి విన్నవింపఁబోవుచుంటి" ననవాయక్షుండును "సరియే! వెంటనే పొమ్ము" అనియాపెను బంపి తనవచ్చినకార్యము సఫలమయ్యె

నని యావృత్తాంతమును ముందుగా జనకునికి నివేదించి పిమ్మటనే యింద్రునకుఁ దెలుపుదునని వెడలివచ్చి మాయారామలక్ష్మణ విశ్వామిత్త్రులు జనకునికొలువునందున్న యాసమయంబున వచ్చి

సీ. "రావణుండును శుకుఁడు సారణుఁడుఁగపట
రామలక్ష్మణగాధిపుత్త్రకుల వేష
ములనుదాలిచి జానకిలలనఁబెండ్లి
యాడవచ్చిరి జాగ్రత్త! యవనిపాల! 77

గీ. అనుచు నాకాశముననదృశ్యమగురూప
మునవచింపశతానందజనకులపుడు
వెఱగుఁబొందిరి రాక్షసుల్ వెలవెలపడి
యొండొరువులను జూచుకొంచుండిరంత. 78

వ. ప్రతీహారివచ్చి దేవా! మరియొకవిశ్వామిత్త్రుఁడు మరియొక రామలక్ష్మణులనుదోడ్కొనివచ్చుచున్నవాఁడు. సెలవయ్యేనేని లోనికిరానిత్తుమన జనకుండును శతానందునితో. 79

గీ. "నామనోరథమీడేర్చి నాకుముదము
గాధిపుత్త్రుండు కల్గింపఁగలఁడటంచు
గంపెడాసవహించితిఁగానియిట్టి
సంకటస్థితినూహింపఁజాలనైతి. 80

వ. కానిమ్ము విధిబలీయము. వీరు మొగములు వెలవెలఁబాఱఁ జూచుచున్నారు. వీరేరాక్షసులయి యుందురేమో!" యన నాతండును "అట్లే నాకును దోఁచుచున్నది" యనెను. అంత జనకుఁడు ప్రతీహారితో "సరియే! వారినిలోనికి రానిమ్ము" అనెను. అప్పుడు మాయారామలక్ష్మణవిశ్వామిత్త్రులు. 81

సీ. క్షత్త్రియార్భకుఁ డెట్లు చంపెనే! మనతాట
కాది రాక్షసుల ననంతబలుల.
సట్టిలేని మనల నందఱఁ బరిమార్ప
శక్తి గలఁడటంచుఁ జాటవచ్చు 82

వ. మనము రక్షకభటునిచే దొంగలువలెఁ గౌశికునిచే నిట నిగ్రహింపఁబడుదుము. కనుక మనమావలకుఁ బోవుటయే మంచి పని యెల్లరును దలంచి జనక శతానందులతో, 'మేమావలికిఁ బోదుము, అస్మద్ద్వేష ధారులగు రాక్షసుల రానిండు. యథోచితముగా వారినిఁ బూజింపుఁడు. కాని జానకినిత్తుమని చెప్పకుఁడు. స్వరూపనిర్ధారణము సేయుఁడ' ని తెలిసి యావలకువచ్చినట్లు వచ్చి తిరస్కరిణీ విద్యాతిరోహితులయి యనతిదూరమున నిలిచి చూచు చుండిరని నారదుండు చెప్పిన విని. 83

శా. శ్రీమద్వీర్యరమాకుమారక! ధరాసీమంతముక్తామణీ!
భూమీపాలకవంశమండన! మహాపుణ్యాత్మ! లక్ష్మాంబికా
భామారత్నకటాక్షమీనహరణప్రౌఢాత్మజాలా! ప్రజా
క్షేమంకార విచారణా! మధురవాక్పీయూషధారాగిరీ! 84

కం. శ్రీమరిపీడాఖ్యపురీ
గ్రామణి! గుణపాలితాష్టకకుబంతమహీ!
భూమహిళాహస్తాబ్జ
శ్రీముకురాయితయశోరుచీ! నిత్యశుచీ! 85

శ్రీపరదేవతాయై.

# జానకీపరిణయము.

## పంచమాశ్వాసము.

కం. శ్రీలా! దిక్తరుణీవే
ణీలక్షితకీర్తికుంద! నీతిప్రౌఢా!
పాలిత బాంధవమిత్రా!
చాలిత శాత్రవకదంబ! శంకరరెడ్డీ! 1

వ. అవధరింపుము. 2

గీ. గాధిసూనుండు రామలక్ష్మణులతోడ
జనక భూవరుచంద్రు కొల్వునకువచ్చు
టాది జరిగినకథను సమగ్రముగను
నాకుఁదెలియంగఁ జెప్పుము నాకుజన్మ! 3

గీ. అనుచు నడిగిన వాల్మీకిమునినిఁగాంచి
ప్రీతిదళుకొత్త నారద ఋషివరుండు
వినిచెనోమునిచంద్రమా! వినుతువినుము
పూసగ్రుచ్చినరీతి నాపుణ్యకథను. 4

గీ. ధర్మముపురస్కరించు ప్రతాపవిక్ర
మములపోలిక రామలక్ష్మణులతోడఁ
గౌశికుండు విదేహ భూకాంతుఁడున్న
పర్ణకుటికేగుదెంచుచుఁ బలుకులోన. 5

ఉ. జానకియందు రాఘవుని స్వాంతముఁ గట్టిగ నాఁటఁ జేసితిం
బూనికి నొండొకళ్ళ వలపుం గొనినప్పుడె వారియోగ మెం
తేనియు శ్లాఘ్యమౌఁ గలలనీ రఘునందనుఁ గాంచి సీతయున్
మేనిని ఝల్లవాస్తరిముమీఁదటఁ జేరిచి ప్రొద్దు పుచ్చెదున్. 6

గీ. మంచిదేయయ్యె రామలక్ష్మణులకిపుడె
జృంభకముఖాస్త్రమంత్రవిశేషముసుప
దేశమిచ్చుట; నిజజననాశమువిని
మండిపడివచ్చు రావణుమాన్పు టెట్లు? 7

మ. కడుమాయావులు క్రూరరాక్షసులు మున్ గానన్ శ్రమంపెట్టి రి
క్కపడన్ మేనరుదెంచు లోపుగఁదగం గల్పించి యేమాయనో
గొడవల్ పెట్టుదురంచు నాదశరథక్షోణీంద్రునిం దాఁటి యె
క్కుడుపు వేగంబుగ వచ్చినారమిటనే క్రొత్తల్ తటస్థించునో? 8

చ. అనుకొనుచుండ రాముఁడు మహాత్మ! విదేహధరాధినాథుఁడౌ
జనకుఁడనంగ నెట్టిఁడు? నిజంబొకొ? యామహనీయు మందిరం
బున సకలామరాసుర సమూహపుశక్తికి మించినట్టి శం
భుని దగువిల్లు నాఁగటనుబుట్టిన కన్నియనుండె నంటగా! 9

గీ. వాని చరితంబు దెలుపంగవచ్చునేని
వినఁగఁగోరెద మనిబిట్టు వినయమడరఁ
బలుకఁ జిఱునవ్వుగ్రాలంగ వదనమందుఁ
గనికరపుఁ దీవవిరులనఁ గౌశికుండు. 10

వ. రామచంద్ర! సర్వంబును దేట తెల్లంబుగా వివరింతు వినుము.
ఆ జనకమహారాజు. 11

గీ. ఫలిత శక్తిత్రయుండు; సంకలితసకల
ధర్మశాస్త్ర రహస్యుండు; కర్మఠుండు
కాంతి తేజంబులను హిమకరవిభాక
రులకు మూఁడవవాఁడు ధీరుండు ఘనుఁడు. 12

సీ. ధర్మార్థముల పేరిత్రాళ్లను య్యేలలూఁగు
రమణీయముగ వాని రాజ్యలక్ష్మి
సరసకటాక్షవీక్షణముల రసికుల
రప్పించునాతని రాజధాని
పటుశాత్రవప్రాణవాతముల్ మేయుఁగా
కోదరంబన వానికోటచుట్టు
కవిరత్నదీపప్రకాండంబులం గ్రాలుఁ
దత్సభామండపాధారభూమి

గీ. మంత్రిముఖ్యులు సఖులు సామంతనృపులు
గొలువఁ జుక్కలఁ జంద్రుండు వెలయుగతిని
సత్కళాపరిపూర్ణుఁడై జనకచక్ర
వర్తి పాలించుచుండు నుభయరీతి. 13

సీ. ప్రాఁకించుచున్నాఁడు బాహుయుగ్మము మీఁదు
గాఁ గీర్తిలతలు దిగ్వలయమునను
అర్పించుచున్నాఁడు హారంబుగా భక్తి
వల్లిపూచినపూలు భారతికిని
సవరించుచున్నాఁడు జలకేళిరాజల
క్ష్మినిఁ గూడి జ్ఞానవాహినులయందు
ప్రాపించుచున్నాఁడు శ్రీపరాత్పరకృపాం
జనలబ్ధకల్యాణఖనిచయంబు

గీ. యాజ్ఞవల్క్యమహామునియంతికమున
బ్రహ్మపారాయణము సేసి ప్రతిభఁ గాంచి
కర్మయోగంబనుష్ఠించి క్ష్మాతలంబుఁ
బాలనము సేయు జనకభూపాలమౌళి. 14

శా. కంపింపండలపర్వతంబువలె నిర్ఘాతంబు పైఁబడ్డ; వీ
క్షింపండెద్దియు సాభిలాషమతియై; శ్రీరాజ్యభోగాలఁ గాం
క్షింపం; డేతగులంబునం బడఁడు; ముక్తింగోరి నిర్లిప్తుఁడై
త్రెంపెన్ సంసృతిబంధ మువ్విధముగా దివ్యప్రబోధంబునన్. 15

శా. యాగంబుల్ పొనరించి దేవతల ప్రీత్యర్థంబనంతంబుగాఁ
ద్యాగంబుల్ జరిగించి మానవులఁ దృప్తస్వాంతులం జేసి పెన్
రాగంబుప్పతిలం బిత్రాణమునుదీఱంగా, నివాపాంజలిన్
యోగిశ్రేష్ఠులు మెచ్చ నాజనకరాజొప్పారు యోగీంద్రుఁడై. 16

వ. ఆతనికి సీరధ్వజుండనియు నామాంతరము గలదు. అతని తమ్ముఁడు
కుశధ్వజుఁడనంబరగు. 17

మ. తనపూర్వుల్ హరునిం జయించియనిలోఁ దచ్చాపరాజంబుఁ గై
కొనియుం గ్రమ్మఱనీక దాఁచ జనకక్షోణీంద్రుఁడద్దానిఁ బే
ర్చిన భక్తిం దనవారివిక్రమకళా చిహ్నంబుగా నెంచి యో!
తనపూజాగృహమందు నెక్కొలిపి నిత్యంబుం బ్రపూజించెడున్. 18

గీ. ఎత్తఁగా నెక్కువెట్టఁగా నీశ్వరుండుఁ
దనదువంశస్థులే సమర్థత గలారు
దక్కఁ గలయట్టి వీరబృందారకులకు
దానినామంబు హృదయవిదారకంబు. 19

వ. ఆరాజేంద్రుండు మహనీయంబుగా రాజ్యంబేలుచు నొకప్పు
డొక మహాయాగంబు సంకల్పించి యజ్ఞభూమిని. 20

ఉ. నాఁగటదున్నుచుండునదనన్ రమణీయమణీసముజ్జ్వల
శ్రీఁగమియించుమందసకృషీవలుకర్తికిఁదాఁకి లాంగలం
బాఁగుడుఁజూచి యబ్బపడి యాకృషికుండు ప్రసాదవార్ధికిన్
వేగనుదానిఁదీసికొని వెళ్లిసమర్పణసేసె భక్తితోన్. 21

గీ. రాజునానతిమంత్రులారత్నపేటి
మూఁతఁదెఱవంగఁగన్నులుమూఁతపడఁగఁ
జేసిమిఱుమిట్లు గొలుపునై చెలువుగలుగు
బిడ్డరత్నంబువలెనందు వెలుఁగుచుండె. 22

వ. అదిచూచియక్కజంపడి 23

సీ. లభియించె నీకల్లలలిత తేజోరాశి
మందిరాంగణమున మణిశిలాని
ప్రభవించె నీగృహారామసీమను మనో
హరరూపమైనకల్పాంకురంబు
ఉదయించె నీగృహవ్యోమంబుననునేత్ర
సంతర్పకము బాలచంద్రరేఖ
అవతరించెను సమభ్యర్చితశివకృపా
పాంగంబు నీగృహాభ్యంతరము

గీ. మొగ్గదొడిగెను నీపూర్వపుణ్యవల్లి
పరగవిచ్చెను నీదివ్యభాగ్యపుష్ప
మబ్బెఁగల్యాణనిధికిసిద్ధాంజనంబు
నీకు నిమివంశ్య! జనకమనీషివర్య! 24

కం. అనిమంత్రివర్యులాజన
కునిభాగ్యముఁ బ్రస్తుతింపఁ గొనియాబిడ్డన్
జనకుండు బ్రహ్మవిద్యను
గొనినట్టులు సంతసించి కూఁతుగఁ బెంచెన్. 25

వ. నాఁగేటి చాలునంబుట్టుటం జేసి యాపెకు సీతయను నామమిడి విధ్యుక్తంబుగా జాతకర్మాది క్రియాకలాపంబులన్నియు నిర్వర్తించి పెంచుచుండె. 26

గీ. అరఁటిపిల్లలప్రక్క పిల్లరఁటి; పూల
చెట్లకడ నొక్క లేఁబూవుఁ జెట్టు; లతల
కడ నొకండగు లతయనఁ గానిపించు
సీత యచ్చోట్ల నిలిచి వీక్షించుచుండ. 27

గీ. కనక కాంచికయై రత్నకంకణమయి
పుష్పమాలికయై శిరోభూషణమయి
దీపికా కోరకంబయి తేజరిల్లు
లలిత లలితాస్య తద్గృహలక్ష్మి కెపుడు. 28

కం. జనకక్షితిపతియాక
న్యను దన పూజాగృహంబునందునఁ బరిచ
ర్యను జేయ నియోగింపఁగ
ననుగ్రహముగాఁ దలంచి యాపెయు మెలఁగెన్. 29

ఉ. ఒక్కదినాన సీత కసవూడ్చుచు నూడ్చుచు దేవమందిరం
బక్కడఁ బూఁజుపట్టి తనయందము డాఁగిన శర్వచాపముం
జక్కఁగఁ బైకినెత్తి పెలుచంబరిశుభ్రము సేయుచుండ నా
చక్కికివచ్చెఁ దండ్రి తనస్నానముఁ దీర్చి పూజసేయఁగాన్. 30

కం. ఒకచేత వింటనెత్తి మ
రొకచేతంబూఁజు దులుపుచుండిన తన కి
న్యకనుం జనకుఁడు కనుఁగొని
నికామ మాశ్చర్యపడుచు నిలఁబడెనటనే! 31

వ. అంతఁ దన్ను ద్దేశించుకొని. 32

శా. శూరాగ్రేసరు లెత్తఁజాలని ధనుస్సున్ వామహస్తంబుచే
నౌరా! చిత్రముపైకినెత్తి నదనాయాసంబుగా సీదుక
న్యారత్నంబిది దేవతాంశమున జన్మంబందె నిక్కంబుగా
నీరాజన్యులయందు ధన్యుఁడవు నీవేసుమ్ము! సీరధ్వజా! 33

వ. అనియనుకొని 34

గీ. నిగురు కప్పిన నిప్పుగా మొగిలుకప్పి
యున్న భాస్కరమూర్తిగానొరనుదాఁచఁ
బడినఖడ్గంబుగా నల్లపడగవిప్పు
కొననిసర్పంబుగా నీపెగొప్పదోఁచు 35

గీ. కానవేవీరుఁడీమహాకార్ముకంబు
నెత్తిమోపెట్టఁజాలునో! యీమదీయ
తనయ నాక్షాత్ర తేజఃప్రధానమూర్తి
కిచ్చెద సుమానుషౌచిత్యమచ్చుపడఁగ 36

వ. అనియప్రియత్నంబుగాఁ ప్రతిజ్ఞఁగావించి పూజను సమాప్తిం బొందించెను. నాఁడు మొదలుకొని యాసీతాకుమారీమణిని దేవతా దృష్టితో భావించుచుండెను. 37

తే. జనకసోదరుఁడైన కుశధ్వజునకుఁ
గూఁతు రూర్మిళయను పేరఁ గొమరుమిగులు
నహహా! సీతయో యూర్మిళయనఁగవచ్చు
నూర్మిళయె సీతయనవచ్చుఁ బేర్మికలిమి. 38

చ. అనుచును గాధిరాట్తనయుఁడా చరితంబు నొగిన్ శ్రివోరసా
యనముగఁ బల్కుచుండఁ బులకాంకరముల్ మెయిఁదోఁపసంతసం
బునఁ జెలరేఁగుఁ; జిత్తమునఁ బొంగును; నుబ్బటలూఁగు; నెప్పుడా
జనకకుమారిఁ గాంతునని సంబరముంబడు రాముఁడయ్యెడన్. 39

చ. తలఁపునఁ బాఱ రామునకుఁ దత్సమయంబున నల్ల సీతదా
తొలుతటి యగ్నిపాతమది తుందుడుకుం గలిగించె మాయగాఁ
దొలుత నెనిశ్చయించినను; దుఃఖకథల్ స్మృతిఁ గొన్నమాత్ర బి
ట్టలమటఁ గూర్చు మానవున కవ్వియసత్యములం చెఱింగినన్. 40

చ. అపుడెమనంబునన్ మెఱసినట్లుగఁ గౌశికమౌని యాగపున్
నెపమునఁ దల్లిదండ్రులను నేస్తులఁ దన్నును దోడితెచ్చి ని
ష్కపుగతిఁ బెండ్లి సేయఁగఁ దగం దలఁచెన్ గదయన్నమాట తోఁ
చి పరమహర్షమొందె విడిఁ; జెన్ వెతవానినిఁ దానయత్తఱిన్. 41

వ. ఇట్లు సల్లాపించుకొనుచు వారు జనకుని పర్ణకుటీరముకడ కేగి ద్వార
పాలకుండు పంపవచ్చుచుండ దూరంబునఁ జూచి శతానందుండు 42

కం. "వీరో! వారో! రక్కను
లేఱుపడుట జరుగుదాఁక నిద్దఱకును స
త్కారంబు సేయవలయును
భూరమణా! యొరఁగరమ్ము! పోవుద"మనుచున్. 43

కం. జనకశతానందులు స్వా
సనములయందుండిలేచి సరభసత నెదు
ర్కొనవచ్చి భక్తినభివా
దనములుసలిపిరి పిదప శతానందుఁడనున్. 44

గీ. మాయదృష్టంపుఁ గలిమిచే మౌనివరుఁడు
గాధిపుత్త్రుండు రామలక్ష్మణులతోడఁ
గూడుకొని విజయంచేసినాఁడటంచు;
జనకుఁడును శతానందుననుసరించి. 45

చ. "దశరథుపూర్వపుణ్యమున దాపరమయ్యెను ఋశ్యశృంగుఁడా
వశియును బుద్ధికాముఁడయి భవ్యముగాయజయించె; భాగ్యపున్
వశమునఁబుట్టిరాత్మజులు నల్వురు తన్నరపాలమౌళికిన్
భృశముగ విద్యలంగఱపి తీవిటకుంగొని తెచ్చి తిత్తఱిన్." 46

గీ. అనుచుఁ బొగడుచునుండ నల్లంతదవ్వు
నందుఁగల రావణుఁడు "పరమార్థబుద్ధి
తోనపలుకునే? యితఁ" డనఁ దోడిశుకుఁడు
"గాదు మనయందె తద్బుద్ధిగలద" యనెను. 47

వ. అంతటఁ గౌశికుండు జనకశతానందులగాంచి. 48

ఉ. "యాగపుసాకునన్ దశరథావనిపున్ సకళత్రపుత్రునిన్
వేగమ తెచ్చుచుండ నడవింబ్రతిరోధముసేసె మమ్ములన్
రేఁగఁగఁజేయుచుంబఱపి వృష్టినిఁదాటక; యంత రాముఁడు
ద్వేగముగల్గుబాణమునఁబీఁచమడంచెను నొక్కవ్రేల్మిడిన్." 49

సీ. అనుభాషణంబునువినిశుకసారణ
రావణుల్ కటకటా! రామహతకుఁ

డల్ల తాటకను స్త్రీయనివధింపకవీడ
లేదుగా! యనుచు విషాదముగని
తక్కిన వారికథానకంబేమయ్యె
ననుకొనుచుండంగ జనకుతోడ
గాధిసూనుఁడు పల్కెఁ "గనలి తాటకచావు
నకుఁదాటకేయాదులాకరోకరుగ

సీ. మిగులఁజీకాకుపఱపంగ రగులుకొన్న
కోపమున రామచంద్రుండు గూల్చివైచె
నాసుబాహునిఁదాటకేయహతకునిఁ గ
రాళుఁ బాఱంగఁదోలె దూరంబునకు. 50

చ. అనుడు విదేహరాజు "పరమార్థమొకో! యితఁడాడుచున్న భా
షణ" మనిశంకగల్గి మునిచంద్రమ! నాగసహస్రవీర్య శా
వినియనివిందుఁదాటక; బళీ! యనబాలుఁడు రాముఁడెట్టులం
దునిమె "ననంగనావిధికిదుష్కరమే?" యనెగాధిపట్టియున్. 51

చ. అనవుడుఁగాంచిమెల్ల జనకావని భర్తకు గౌతమాత్మజుం
డను; "నిటులుండె వీరికథ! యాయయివీరియథార్థతానిరూ
పణమెటుసేయవచ్చు" ననిపల్క విదేహుఁడు "శైవచాపకుం
చనపణబంధశుల్కమునుజాలెదఁ గన్యక" కంచుఁదెల్పగన్. 52

వ. విని శతానందుండు చిఱునవ్వు నవ్వి 53

కం. కైలాసభూధరంబును
కేలంబువుబంతిలీలఁ గిలించిన యు
ద్వేలపరాక్రమనిధిగద
చాలండె! దశాననుండు చాపమువంపన్. 54

గీ. నావుడటుగాదు దేవదానవులయందు
సిద్ధచారణగంధర్వశ్రేణియందు
నొక్కరుండును జాపంబునెక్కువెట్టఁ
జాలఁడనిమున్న వచియించె శంకరుండు 55

వ. అనిజనకుండుసెప్ప శతానందుండు "మేలుమేలు. ఇదియే ప్రతిజ్ఞ
సేయు" మనియె. దశాననుండును దమవారెల్లరును మరణించుట
విని మండిపడి. 56

చ. కరువలివీవఁగాజడియు గట్టిగ; భాస్కరుఁడెండగాయఁగా
వెఱచును; గాల్పఁబావకుఁడు భీతిలునెవ్వనివార్తవిని నా
బిరుదుమగండు రావణుఁడు విశ్వమునేలుచునుండె నింక నీ
చిఱుతవధించినాదయిన సేవకులంబ్రదుకందలంచెనే? 57

సీ. కైలాసమువ్వొత్తుగాఁబెకలించిన
యిరువదిహస్తంబులింకఁగలవు
కాలునిపవ్రిబలదోర్గర్వంబునడఁచిన
మయదత్తమైనశక్తియునుగలదు
అఖిల దిక్పతులప్రాణానిలంబులమేయు
పాములగమిబాణపంక్తిగలదు
మృత్యుదేవతకునపత్యంబునానొప్పు
శాంతమాచంద్రహాసంబుగలదు

గీ. ఎదిరినాకెవ్వఁడిప్పుడేయెగిక్షత్త్రి
యార్భకునికంఠలుంఠనంబాచరింతుఁ
గౌశికుఁడో? వానియబ్బయో? కానివచ్చి
యడ్డుపడునేమొ? చూతునటంచులేచి. 58

గీ. అడుగుబెట్టంగ సేవకులాఁపిపట్టి
స్వామి! నెటికేఁబోలె విఱువఁజాలినట్టి
రాచనిసువుపై నింతసంరంభమేల?
పిచ్చికపయి బ్రహ్మాస్త్రంబు వేయవలెనె? 59

వ. అనిపలుక దశాస్యుండును శాంతించియు మొగంబుముడుచుకొని కూర్చుండెను. కౌశికుండును జనకశతానందులరహస్యభాషణంబులువిని "వీరు మమ్మన్యథా భావించుచున్నట్లుండిరి. మారాకకుముందే మాయావులగురాక్షసులు వచ్చి వంచించి యుందురేమో? కానియిట్లడిగిచూతు"ననితలఁచి "రాజా! జనకా! వత్సా! శతానందా! నాతోనేదియో చెప్పఁదలఁచినట్లున్నారు. అది తెలుపుఁ"డన జనకుఁడు శతానందునికి సన్న సేసిన నతండును.

గీ. త్రిభువనంబులయందుక్షత్త్రియకుమారుఁ
డెవఁడు మోపెట్టఁజాలునో? యిందుమౌళి
చాపమును వానికిచ్చును జనకరాజు
కన్యకారత్నమును గుణాకల్పవతిని. 61

చ. అననగిగాధిపుత్త్రికుఁడనాశ్వాసనీయులుగాఁదలంతె? మ
మ్మును, నగులెమ్ము; మాయికులుపుణ్యజనుల్ కొని పెక్కురూపులం
గొనకొని మోసపుచ్చుటకుఁ గ్రుమ్మఱుచుండఁగ విశ్వసించు నె
వ్వని నెవఁ; డట్లయేని విలువంచును రాముఁడు దెమ్ము దానినిన్. 62

కం. అనుడుశతానందునిఁగని
జనకుఁడుమౌనీంద్ర! నీవెశాంకరచాపం

బునుబూజనేసి వెసఁదో
డ్కొనిరమ్మని” పలుకనాతఁడుంగదలిచనెఁ. 63

వ. అంతట రావణుండును. 64

కం. కైలాసమెత్తఁజాలిన
కేలను హరచాపమెత్తి కీలింపంగాఁ
జాలనునేనే; యీపసి
బాలుఁడుమోపెట్టునంట! బళి! మునిపలుకుల్. 65

కం. అనభిజ్ఞత్వమునఁబ్రతి
జ్ఞనుదాఁగావించినాఁడు జనకుండిఁకనీ
ననబోఁడి పెండ్లి లేకయె
మనవలసినగీఁతయుండ మాన్పగవశమే? 66

చ. అనుకొనుచుండగౌతమునియాత్మజుతోడ శతంబుముందుకో
మ్ముననవెనుకొమ్మునందుశతమున్ నడుమన్ శతమున్ మహాబలుల్
ఘనదృఢకాయులౌభటులు కష్టముతోడ బుజాలుమార్చుకొం
చునుగడునొంకృతుల్ సలుపుచున్ శివచాపము మోసి తెచ్చినన్

మ. మునియాజ్ఞన్ రఘురాముఁడాధనువునన్ మోపెట్టఁగాఁబోవుచుం
“డనరే! జంకునుగొంకులేకితఁడు విల్ డాయుంగదే!” యంచురా
వణుఁడున్ “గుఱ్ఱఁడువీఁడుచాపమును దివ్వంజాలునే?” యంచుసా
రణుఁడుం“బొందునె? సీతనీతఁ”డనుచబ్రంబున్ శుకుండుంగొనెన్

వ. ఇట్లుండజనకునియాజ్ఞను గౌశికమునికినమస్కరించుటకు సీతయు
నూర్మిళయు, మాండవియుశ్రుతకీర్తియు నరుదెంచుచుండిరి 69

సీ. "ఏంటివే? గాధేయు నెంటనిద్దఱు రాజ
సుతులువచ్చిరియంట! సుదతిసీత!"
అనుచుఁజిర్నగవుతో ననుడు మాండవి సీత
"యౌనఁట" యనె లేఁతనానఁబూని
"వారిలో నొకఁడొక బాలికహృదయ చో
రుం"డఁట యనెఁదిర్గిమాండవియును
సాసూయముగసీత "చాలుఁజాలును లెమ్ము
మిన్నకరమ్మ" నెమిగులఁగినిసి

గీ. నగుచునూర్మిళ డాసి జానకి! యిదేల?
మాండవివచించినట్టి యీమాటనీవు
పైనివేసుకవత్తువు; వాదులాడ
ననుచుజానకిగొట్టె లీలాంబుజమున. 70

గీ. అంతశ్రుతకీర్తి వెంటనేయందుకొనుచు
నున్నమాటన్న జానకీ! యుదుకుఁబోతుఁ
దనముఁబూనెద వేటికే? తప్పుమాట
యేమిగలదిందు నిజముగా నీవె తెలుపు. 71

మ. మనలో నెవ్వతె? రేల స్వప్నములలో మారోజ్జ్వలాకారునిం
గనుచుం క్షత్రియపుత్త్రునొక్కని నిదాఘక్రాంతి శుష్యత్ప్రవా
హినినాఁ బ్రత్యహముం గ్రమక్రమముగా నేవంవిధం జిక్కుచుం
డిననెమ్మేను వహించుచుండినదొ? కాన్పింపంగ రాకున్నదే? 72

గీ. పాలతో స్నానమాడింపఁ బడుచునున్న
బంగరువు బొమ్మయందంబు పరిఢవిల్లు

నెవ తెయంగంబులందు నీయిచటనున్న
కన్నెలందీవెకని చెప్పఁగదవె? సీత! 73

మ. మరియుందెల్పుమెవర్త్తపుష్పవనికా మధ్యంబునన్ దాఁపం
దిరిక్రిందం దలిరాకుసెజ్జపయి మైనిం జేర్చి శైత్యోపచా
రరతిం జుట్టును జేడియల్ గొలువ నశ్రాంతంబు నిట్టూర్పులం
బఱవం జేయుచుఁ బ్రొద్దుపుచ్చెడునొ! దాపందాఁగునే? కోమలీ! 74

వ. మరియు 75

చ. కనులకునిద్రరాదది యొకానొకతూరిలభించెనేని వెం
టనెయువయొందు రాముఁడట నామము నవ్వుచు దగ్గఱించి మె
ల్లనఁ జెయిమీఁద వేసిననులాగుచు సందిటికూఁదిపంట మో
వినిఁ దెమలించుఁబైటబయిపెచ్చుగ దోసిలియొగ్గునల్గిసన్. 76

గీ. అనుచు నెవ్వాత నిదుర మేల్కాని స్వకీయ
సఖులతోఁ బల్కు విజనదేశములయందు
చిలుకపయిబెట్టి పలుమారు బలుకు నెవతె
"రాముఁడా! వచ్చి నాచేతవ్రాలు" మనుచు. 77

గీ. అనుచు నూర్మిళామాండవుల్ జనకకన్య
మొగముపయిఁజూడ్కినిగుడించి నగుచునుండఁ
దనరహస్యంబు బయలయ్యెననుచు సీత
సిగ్గుదొడరియు ధైర్యంబు చిక్కఁబట్టి. 78

ఉ. ఏమనిదూఱుదానమిము నీసుతకీరితి నవ్వుటాలకే
మేమొ! కృశించుచుంటినని యెంతయు దేహము పాలిపోయెనం
చామెయిఁ గల్లగాథలనునల్లి కడుంగడుఁ జిన్నపిల్లనే
నేమియుఁ జెప్పఁజాలనియెంచి వచించెదు నమ్మఁబోకుఁడీ! 79

గీ. అనియె; నిట్టులువారాడుకొనుచు జనకు
కొలువుఁగూటంబునకుఁబోయి యెలమినచట
శైవచాపంబు, సద్దాని సన్నిధాన
మందు నిలఁబడియున్నట్టి వ్యక్తిఁగనిరి. 80

వ. అప్పుడు సీత తెప్పవాల్పక వానినిఁగాంచి మనంబున 81

మ. కొమరుంబ్రాయము, పాలచెక్కిళులునుం, గ్రొంగ్రొత్తనూ
నూఁగుమీ
సము, లొడ్డుంబొడుగైనమేను, మిగులన్ క్షాత్రంపుఁదేజంబుఁ జి
మ్ముమొగంబుం,గళలన్వెలార్చుకనులున్,ముద్దాడఁగాఁగోరురూ
పమునుం, బొంగెడుసౌకుమార్యఖనియీబాలుండెవండైతగున్?

మ. కలలంగాంచిన నామనోహరునియాకారంబెకన్పట్టు నీ
కులుకుంబ్రాయపుఁజిన్నవానికడ; నాకోర్కిన్ ఫలింపించెనే
యిలువేల్పైనశశాంకశేఖరుఁడునేఁడీ? మూర్తినీక్షింప దు
ర్లలితుండై మరుఁడేయఁగాశరములారంభించె నామీఁదటన్. 83

గీ. అనుకొనుచుఁ "చెలియండ్రార! యద్భుత ప్ర
భావుఁడునుమూర్తిఁగొన్నతపశ్చయంబు
నైనకౌశికమునిముఖ్యుఁడరుగుదెంచె
వందనముసేయరండ" ని పలికెమెల్ల. 84

చ. అమృతముమీఁదఁజల్లెడుక్రియన్, ఘనసారముసేర్చినట్టి గం
ధమునునలందునట్లు; హిమధారలుపైఁబడుచున్నయట్టులా
బ్రమదవచించు భాషణమురామునకున్ వినరాఁగనాఁటికృ
త్రిమజనకాత్మజావచనరీతిగనుంటకునబ్రమొందుచున్. 45

గీ. మొగముపయికెత్తుకొని పార్శ్వమునకుఁద్రిప్పి
కనఁగనట దివ్యమంగళతనువుగలుగు
లేఁతప్రాయంపు సుందరుల్ నిలిచిరందొ
కర్త్తమునుగన్న జానకి గతినిఁబొలిచె. 86

కం. మక్కువనపుడొండురువుల
దృక్కులు మెలివెట్టి ప్రేమదీపార్థముగా
మిక్కిలిముప్పిరివత్తులు
నక్కఱమెయిఁబేనికొనిరియానందముగన్. 87

గీ. తీర్చిదిద్దినరీతివర్తిల్లుచున్న
యొకరిచక్కందనంబునింకొకరుచూచి
కొనిరియొడలెల్లఁగనులుగాఁగూర్మిమెఱయ
జానకీరామచంద్రులాసమయమందు.

వ. అప్పుడు రామచంద్రుండుతనివోక. 88

సీ. బాలరంభాస్తంభజాలసౌభాగ్యంబు
మొత్తంబుగాఁబోఁతపోసినట్లు
కమనీయమల్లికాసుమపరిమళరేఖ
గట్టిగాఁబెనుగడ్డకట్టినట్లు
మానితహైయంగవీనమార్దవభూతి
చెన్నొందఁగాఁబ్రోగుసేసినట్లు
సలలితమాకందఫలరససంపత్తి
పెల్చనాకృతిఁదాల్చినట్లు
గీ. ముగ్ధమధురంబునగు జగన్మోహనంబు
శాంతిసంబద్ధమైనయీకాంతరూపు

కనిన లక్ష్మియె యవతరించినదటంచు
నిశ్చయంబుగఁ దోఁచు వేనికిని గాని! 89

గీ. ఆకుఁబచ్చని మృదుళ చీనాంబరంబు
దాల్చియుండియు నెడ నెడఁ దరుణి మేను
ఆకులంగప్పఁబడికూడ నంతరాంత
రములరమణించు తరుశాఖరహిని బోలుచు. 90

గీ. త్రివళికోణంబు గబ్బి చన్గవ యలాబు
వల్లనూగారు దండంబు హారలతిక
తంత్రికాఁగ సంగీతవిద్యను బఠించు
మరుని చేవీణఁ బోలె నాతరుణి మెఱయు. 91

వ. అని యభివర్ణించి 92

చ. "ఎపుడు మదీయ బాహువుల నీపె దృఢంబుగఁ గౌగిలింతునో?
రేపరేపదీఱఁగా" నని మరిః విమృశించి యొకింత సేపు "ఖం
డపరశు చాపముందిగిచినంగద! నాకులభించు నీపె లాఁ
తిపగిదిఁ బొందఁగా" దనుచుఁ దివ్వఁగ జాపము సంభ్రమించుచుః. 93

చ. బిడుగుల మొత్తముం గరఁచి పెద్దగఁ గర్వునఁ బోసినట్టులుః
వడిచిన రీతిగాఁ ద్రిదశపంక్తుల తేజములః; గుదింపఁగాఁ
బడిన తెఱంగునం గనకపర్వతసారము, గడ్డకట్టి నా
మృడుని ప్రతాపరేఖ వలె మించెడు సింగిణిఁ జేరి వంగుచుః. 94

ఉ. నివ్వెఱపాటుతోడ గమనించుచునుండఁగ సభ్యులెల్లరుం
దవ్వఁగ వింటిఁ జేతఁగొని తేలిక జీలుగు బెండు రీతిఁ గ
ర్ణవ్వు సెలంగఁ జేయుచు గుణధ్వనిఁ గోలను బూన్చిలాగఁగాఁ
జెవ్విని దాఁక ఫెళ్ల నిరసించుచుఁ దుండెములై భువింబడెః. 95

వ. అప్పుడు 96

సీ. ముల్లోకములనున్న భూధ్రసంతతియొక్క
పెట్టునబ్రద్దలై బెడిసినట్లు
సప్తవారధులొక్కసారిగా జృంభించి
యుద్ధతిఘూర్ణిల్లుచున్నయట్లు
భూమియునాకాశమును గ్రోధభాటి న
న్యోన్యంబు ఢీకొనుచున్నయట్లు
కల్పాంతకాలోత్థకాదంబినీకాండ
భవమైనస్ఫూర్జథుధ్వానమట్లు

గీ. రామచంద్ర సమాకృష్ణ భీమశైవ
చాపభంగతాత్కారంబు సంశయించి
ముజ్జగంబులవారలు మూర్ఛగొనిరి
ముగురువేల్పులుఁ జెవ్వులు మూసికొనిరి. 97

ఉ. ముక్కులవ్రేలివేసికొని మోములు వెల్వెలఁబాఱియుండఁజే
రక్కనరాలుపడ్డగతిఁ బ్రాణములాశినిఁబట్టఁ జేష్టలం
దక్కియుఁగొంత తెప్పిఱిలి తమ్మొదిరింప నతండు ప్రాణముల్
దక్కుట దుర్లభంబని తలంచిరి యాశుకసారణుల్ మదిన్. 98

వ. అప్పుడు రావణుండు శుకసారణులంగాంచి 99

గీ. చంద్రశేఖర చాపభంజనమనంగఁ
బంక్తిముఖుని మనోరథభంజనంబు
జానకరాములకుఁ బెండ్లి జరుగుటయన
రావణునకదిహృదయమర్మవ్రణంబు. 100

ఉ. వ్రాఁతలు పెట్టుచున్నగతి స్వాంతముపై; మొదలంట అంపపుం
గోఁతను గోయుచున్న క్రియఁ; గోట్లకొలందిగఁ దేళ్లఁ బాములన్
లోఁతుగ నానఁగుట్టునటులుం, గడుఁ గ్రాఁగుచుఁ బొంగునీరు ధా
రాతతిఁ బోయురీతి ననురాముని విక్రమరేఖ నొంచెదన్. 101

చ. విఱిచెను వింటి నీ నిసువు; పేరిమిఁ బట్టు విదేహకన్యకా
కరమును; దాత మైథిలుఁడు; గాధిసుతుం డనుమంత; తాల్చి తా
నరపశు వేషమీ యసురనాయకుఁ డేస్వయమేగుదెంచెఁ ద
ద్వరణముకై; మనోరథము తప్పెనటన్నను నవ్వరే! జనుల్ 102

గీ. కనుక మొదట నేనా వారిఁ దునిమి నాకుఁ
గీఁడు సలిపిన రాముని గీటడంచి
పిదప సఖు నేని జనకుని జిదుమ వలయు
జనకజ హరింపవలె వాని శాస్తిగాఁగ. 103

మ. అనిపల్కంగ మహాప్రభూ! యిపుడె నీ వాజ్ఞప్తిఁ గావింప హ
మ్మని యీ మానవడింభుపై దుమికి వ్రయ్యల్ సేసి వక్షంబు నా
తని మాంసంబును సంజకొంచు నసిచే తంజీల్పఁ గాఁ బడ్డ త
జ్జనకక్ష్మాపతి కంఠరక్తముల నిచ్చంగ్రోలుదుం దృప్తిగాన్. 104

కం. అని తనకొలంది యెఱిఁగియుఁ
దన ప్రభుప్రియంబుకొఱకుఁ దగ నాడియు సా
రణుఁడ తఁడు దద్వ్యాధార్థం
బనుపునో? యని పీఁచుపీఁచుమను నెదనుండెన్. 105

వ. ఇట్లు రాక్షసులు సంభాషించుకొనుచుండ నచ్చట 106

ఉ. కాంచి విదేహభూపతి మొగంబును గౌతముపుత్త్రికుండు "వి
క్షించితె? రాజ! కౌశిక ఋషి ప్రవరాదులు వీరె! పూర్వమే

తెంచినవారె రక్కసులు దెల్లముగాఁదెలిపెంగదే సమ
ర్థించి భవత్కృతంబగు ప్రతిజ్ఞనురాముఁడు విక్రమంబునన్!" 107

కం. అనమాయదాఁటి పరమా
త్ముని సందర్శనముఁగొన్న పోలికయయ్యెన్
మనకథయని సంతసమున
జనకుఁడు "రావోయి! రామచంద్ర!" యటంచున్. 108

చ. తొడపయివానిజేర్చుకొని తొంగలిఱెప్పలఁగూర్మిచిప్పిలం
బుడుకుచు మోమునందలయుముద్దులుగొంచును ఫాలభాగముం
గడుగడుఁగౌఁగిలించుచు నెగాదిగఁజూచుచుఁదీఁపుపోవమిం
దడవలుపెక్కులట్టులె యొనర్చుచు వేడుకఁబొందియత్తఱిన్! 109

గీ. "నామనోరథరథమువిన్నాణముగను
గ్రుంగిపోకుండఁజేసినకోవిదుఁడవు
గాధివంశాబ్ధిచంద్రమా! సాధుమూర్తి!"
యనుచుసాష్టాంగమెరఁగిదీవనలువడసె 110

గీ. గౌతమునిపట్టియప్పుడుకౌశికుఁగని
రామునకు సీత; నూర్మిళారమణి లక్ష్మ
ణునకు నల్లమాండవి భరతునకునుశ్రుత
కీర్తి శత్రుఘ్ననకు నిచ్చుక్షితివరుండు. 111

వ. అని పలుక ముని సంతసించె. 112

గీ. దూసివేసిన కొమ్మగాఁ దోఁచుచున్న
జనకసుత రాముఁగనుగొన్న క్షణమునందె
చిగురుపట్టెఁ; దద్విక్రాంతి పగిదిఁగాంచ
నాకుగుబురులఁ దొల్లింటిదయ్యెమరల. 113

గీ. "చెఱకుగడఁ గున్నయేనుంగు కరణి నీతఁ
డప్రయత్నంబుగా వింటి నంటి విఱిచె
సీత! నీపంటపండెఁబో! చెప్పనేల!
యనుచుఁ జెలియండ్రు వలుక సిగ్గును గమించె. 114

వ. ఆసమయమున జానకీరాములకు 115

మ. అనురాగాపగ జన్మముం బడసి యన్యోన్యంపుఁ గ్రీఁగన్నులం
దనఁ దీవ్రమ్ముగఁ బాఱుచున్ గురుజనస్తోమంబు నా వారధిం
దన వేగమ్ము దిదగ్గి యొడ్డులొరయన్నా వెన్కకుం దట్టి పొ
ల్చెను సంద్రంబాయనంగఁ గాని యది దర్శింపంగరాదెంతయున్.

వ. అప్పుడే 117

ఉ. బంగరువంటిమేని జిగివాఁడగు లక్ష్మణుఁ గాంచఁ బ్రేమపుం
బొంగులు వచ్చె నూర్మిళకుఁ బొల్పుగ లక్ష్మణుఁ డాపె వాలుఁగ
న్నుంగవ పెన్వలంబడి తనున్ విడిపించుకొనంగలేక బి
ట్టుంగదఁ బొందుచుండెను మృగార్భకమట్టులు సంభ్రమించుచున్.

గీ. జనకుఁ డత్తఱిఁ గని కూఁతులను "మహర్షిఁ
కౌశికునకుఁ జేయుఁడు నమస్కార"మనుడు
నొక్కరొకరుగ నేతెంచి మ్రొక్కి పెక్కు
దీవనలు పొంది లేచి యంతిపురమునకు. 119

గీ. తిరిగి చూచుచు వెనుకకు మరలమరల
వెనుకఁ బడినట్టి వారినిఁ బిలుచుమిషను
నడుగుసాఁగక ముందుకుఁ దడబడునుడిఁ
బిలుచుకొనుచు జానకియు నూర్మిళయుఁ జనిరి. 120

వ. వారలతో మాండవీశ్రుతకీర్తులును జనిరి. అప్పుడు రామ
లక్ష్మణులు దమతమప్రియతములఁ జిత్తంబులందలంచుకొని 121

మ. "చనుచుందిప్పుచుమాటిమాటికి మెడల్ సాగించి యావృత్తవృం
తనవాంభోజముఁబోని నెమ్మొగము నాతన్వీశిరోరత్నమం
తనుబీయూషవిషానులిప్తమగుసాంద్రంబౌ కటాక్షంబు పం
క్తిని నాచిత్తములోనలోఁతుగను బాఁతెన్ లాగరాకుండఁగన్"

కం. అనుకొనుచువాండ్రు చను ది
క్కునకుందమదృష్టిపఱపికొని కాంచుచొగిం
గనుచూపుదాఁటి చనుదాఁ
కను మైమఱచియును జిత్రగతినుండిరటన్. 123

వ. అంతగౌశికుండుమహారాజా! ఇఁకను మనము వివాహసంరంభ
మాచరింపవలయుననుడు మౌహూర్తికుల రావించి శుభ
లగ్నంబుఁబెట్టించి సేవకులఁబిలిపించి కల్యాణమంటపంబలంక
రించి వివాహమునకు సర్వంబాయత్తంబు చేయుండని తెల్ప
టయువారు. 124

సీ. పచ్చనికొబ్బరిపందిళ్లుమామిడా
కులతోరణాల్గట్టి కొమరుమిగుల
నడవిపువ్వులఁదెచ్చియందగింపవితాన
తతిఁదాపినిల్వుటద్దాలమర్చి
వివిధవర్ణప్రదీపికలనంతట నిల్పి
కడుఁబుష్పవిటపిసంఘములుచేర్చి
పండ్లయరంట్లకంబాలను నిల్పి ముం
గిట రంగవల్లులఁగీలుగొలిపి

సీ. గోడలకు వెల్ల వేయించి గుమ్మములకుఁ
బసుపుఁగుంకుమములుపెట్టి భవ్యముగను
జిత్రపటముల వ్రేలాడఁజేసి తద్గృ
హమున వేడుకలంజేసిరతిశయముగ. 125

ఉ. అసమయంబునన్ దశరథావనిపాలవరుండుదాను వి
చ్చేసెను భార్యలన్ సుతులఁజేకొనియంచును దెల్ప సేవకుల్
డాసివిదేహభూపతి హడావడిగానెదు రేగిమన్ననల్
చేసియుఁదోడితెచ్చినివసింపఁగఁజేసెను నొక్కసాలలోన్. 126

వ. అప్పుడు. 127

మ. సుముహూర్తంబుసమీపమయ్యెననుచున్ సూరుల్ నివేదింపగాఁ
దమిరామాదులనల్వురన్ వరుస సీతాముఖ్యలన్ నల్వురం
గొమరుంబంగరుపెండ్లిపీఁటలపయింగూర్చుండఁగాబెట్టి కూ
రిమిజేయించిరిమానిపత్నులిడిహారిత్రిన్ మంగళస్నానముల్. 128

వ. తదనంతరంబు 129

గీ. దశరథుండునుగాధిపుత్రకుడు బెండ్లి
పెద్దలైయిరువంకల వెలయుచుండ
జనకపతికాళ్లుకడిగిదాశరథులకును
కన్యకాదానములొనర్చె గౌరవమున. 130

గీ. తాళిబొట్టుకట్టుట; తలంబ్రాలుపోసి
కొనుట;లాజహోమము సేసికొనుట; రుంధ
తినిగనుట ; నాకబలియునీటీరుననట
జరిగెనుద్వాహకార్యముల్ శాస్త్రవిధిని. 131

వ. పిమ్మట 132

కం. జనకునకును దశరథునకును
మునులకునుఁ వందనములు పొనరించియు దీ
వనలను దంపతులందఱు
గొనిరానందంబు వెలిగొనఁగా మదులన్. 133

వ. అంత విందులారగించి జనకుండిచ్చిన సమ్మానంబులందికొని
కౌశికునియొద్ద సెలవుగైకొని దశరథుండు దారపుత్త్రస్నుషాయు
తుఁడై సాకేతంబునకుంజనియెను. జనకుండును హర్షంబున మిథిల
కేగెను. విశ్వామిత్త్రుండును స్వకార్యంబవిఘ్నంబుగా సమకూరి
నందులకు సంతసించి సుఖంబుండె. 134

గీ. రాక్షసులు గాంచుచుండి సర్వంబుదీని
నూయలిఁకనచ్చిరావని మానికొనుచు
వ్యసనమొందుచు లంకకునరిగి; రనుచుఁ
దొడరి వాల్మీకితో నారదుండువలికె. 135

శా. ప్రాచీనార్యకళాలతా తరువనీపాలావతంసోత్తమా !
శౌచౌదార్యముఖప్రసిద్ధగుణవృక్షశ్రీవసంతోదయా !
రోచిష్ణుస్వపురాంబరాంతరతటీప్రోల్లాసిజైవాతృకా !
నీచీభూతసమస్తశాత్రవతతీ! నిత్యప్రసిద్ధోన్నతీ ! 136

గీ. విమలమౌద్గల్యగోత్ర పవిత్రమూర్తి !
సరస సంగీత సాహిత్య శాస్త్రరసిక !
వదన నృత్యన్మహారాజ భాగ్యకళిక !
ప్రియకరాభిఖ్య ! శంకరరెడ్డిముఖ్య ! 137